# ఉపోద్ఘాతం

"కమ్యూనిస్టు ప్రణాళిక" ప్రచురణకుముందు 1848 విప్లవాలనాటికి యూరపు దేశాల్లో రాజకీయ పరిస్థితు లెలా ఉండేవో మొదట తెలుసుకోవడ మవసరం. ఆ దేశాల ఆర్థిక, సామాజిక స్థితిగతులు "కమ్యూనిస్టు ప్రణాళిక"లో విపులంగానే వర్ణించబడ్డాయి.

ఆధునిక యూరపుయొక్క రాజ్యాంగం 1648 లో జరిగిన వెస్ట్‌ఫేలియాసంధిద్వారా రూపొందింది. ఈ సంధితోనే 30 సంవత్సరాల యుద్ధం ముగిసింది. యూరపియన్ "మహా సంగ్రామ" మంతటిలోనూ 30 సంవత్సరాలయుద్ధమే మొట్ట మొదటిది; అదే ఎక్కువ విధ్వంసాన్నికూడా కలిగించింది. ఆ తర్వాత గడచిన 100 సం॥రాలకాలంలోనూ యూరపులో అనేక యుద్ధాలు జరిగినప్పటికీ, వాటివల్ల ప్రధానమార్పులేవీ జరుగలేదు. వివిధరాజ్యాల బలాబలాలు వెస్ట్‌ఫేలియాసంధి నాటికి ఉన్నవిధంగానే ఉండిపోయాయి. ఫ్రెంచివిప్లవం (1789) జరిగేనాటికి యూరపులో ప్రధానమైన దేశాలు క్రిందివిధంగా ఉండేవి.

ఇంగ్లండ్‌లో చట్టబద్ధరాజరికం (Constitutional Monarchy) ఉండేది. అధికారం భూస్వాములచేతుల్లోనూ, బాగా ధనవంతులైన వర్తకులచేతుల్లోనూ ఉండేది. బలమైన నౌకాబలం,ఎగుమతి దిగుమతులవ్యాపారం, నానాటికీ అభివృద్ధి చెందేసామ్రాజ్యం (ఉత్తరఅమెరికా అప్పుడే బ్రిటన్‌నుంచి విడి

పోయినప్పటికీ) ఇవి ఆనాటి ఇంగ్లండ్ యొక్క ముఖ్యలక్షణాలు. ఫ్రాన్సులో నిరంకుశరాచరికం (Unlimited Monarchy) అధికారంలో ఉండేది. బోర్బన్ వంశపుచక్రవర్తులు రాజ్యపాలన చేస్తూ ఉండేవారు. అతినీచమైన జమీందారీవర్గం ఎల్లప్పుడూ ఖాళీగాఉండే ఖజానా, అధికారాన్ని హస్తగతంచేసుకోడానికి సిద్ధంగాఉన్న బూర్జువావర్గం – ఇవీ ఆనాటి ఫ్రాన్సుయొక్క ప్రధానలక్షణాలు. వ్యవసాయబానిసపద్ధతినుంచి (Serfdom) విముక్తిపొందాలని తహతహలాడే ఫ్రెంచిరైతాంగానికి బూర్జువావర్గం నాయకత్వంవహించింది. స్పెయిన్ అవినీతికరమైన రాచరికంక్రింద (Corrupt Monarchy), జమీందారీ వర్గంక్రింద, మతాధిపతులక్రింద నలిగిపోతూ, ఎంతో వెనుకబడ్డ దేశంగా ఉండేది. బోర్బన్ వంశానికిచెందిన మరోకుటుంబం రాజ్యపాలనచేస్తూ ఉండేది. జర్మనీ, 100 సంవత్సరాలనుంచీ ఉన్న విధంగానే పవిత్ర రోమన్ సామ్రాజ్యంగా ఉండేది. అనగాచిన్నచిన్న నిరంకుశ ప్రభువులు పారిపాలించే అనేకరాజ్యాల ఫెడరేషనుగా ఉండేది. వాటిపై కేంద్రప్రభుత్వానికి ఉండే అధికారం బహు స్వల్పంమాత్రమే. ప్రతి చిన్నరాజ్యం స్వతంత్రంగా వ్యవహరించేది. ఇలాంటి రాజ్యాలలో ప్రష్యా, ఆస్ట్రియాలు ప్రధానమైనవి. ప్రష్యా ఉత్తరదిశను ఉండేది. అనేక శతాబ్దాలుగా ఒక రాష్ట్రం తర్వాత మరోరాష్ట్రాన్ని కబళించడంద్వారా, అది విస్తరించింది. ఈ విస్తరణకు ఫ్రెడరిక్ ది గ్రేట్ చాలవరకు కారణం. ప్రష్యన్ రాజులు అతికఠినంగా తరిఫీదుపొందిన సైన్యంపైన, అట్టి లక్షణాలేగల నిరంకుశాధికారులపైన, జంకర్లు అనబడు

జమీందారీ సైనికాధికారులపైన ఆధారపడేవారు. జంకర్లు అనగా వ్యవసాయ బానిసలచేత (Serfs) తమ ఎస్టేట్లను సాగు చేయించుకొనే జమీందారీ మిలిటరీవర్గం. దక్షిణాన ఆస్ట్రియా హాప్స్‌బర్గ్ వంశానికి చెందిన రాజులచే పరిపాలింపబడేది. జర్మన్ సామ్రాజ్యాన్ని వంశపారంపర్యంగా పరిపాలించేది వీరే. వీరు క్రమేణా హంగరీ, బొహీమియా, బెల్జియం దేశాలనేగాక, స్లావ్ జాతులు నివసించే ప్రాంతాన్నీ, పోలెండులో కొంతభాగాన్ని కలుపుకొని బలపడ్డారు. ఇలాంటి అసంఖ్యాకమైన రాజ్యాలపైనే వీరి నిజమైన అధికారం ఆధారపడి ఉండేది. పోలెండ్ విషయం ఏమంటే, ప్రష్యా, ఆస్ట్రియా, రష్యాలమధ్య అది విభజింప బడింది. రష్యా పీటర్ ది గ్రేట్ తర్వాత ఎంతో విస్తరించింది. విదేశవ్యాపారం, సైనికబలం అనేక రెట్లు హెచ్చాయి. బాల్టిక్ సముద్రంనుంచి, నల్ల సముద్రంవరకు రష్యా సరిహద్దులు విస్తరించాయి. టర్కీ ఆనాటికి శిథిలావస్థలో ఉన్నప్పటికీ బాల్కన్ రాజ్యాలపై పెత్తనం చెలాయిస్తూ ఉండేది. ఇటలీ పూర్వం మాదిరిగానే అనేక చిన్న రాజ్యాల కూటమిగా ఉండేది. వాటిలో ముఖ్యమైనవి ఉత్తరాన వెన్నిస్ రిపబ్లిక్కు, సార్డీనియా రాజ్యం, మధ్యభాగంలో పోప్ మతాధిపతిక్రింద కొన్ని రాజ్యాలు, దక్షిణాన బోర్బన్ వంశానికి చెందిన మరో రాజకుటుంబం పాలనక్రింద నేపుల్స్ రాజ్యం.

ఫ్రెంచి విప్లవంవల్ల రాచరిక ప్రభుత్వం కూలిపోయింది. ఫ్రాన్సు ఒక రిపబ్లికుగా మార్పుచెందింది. కాని వెంటనే (1793) దాన్ని నాశనం చేయడానికి ప్రష్యా, ఆస్ట్రియా,

ఇంగ్లండ్‌ల నాయకత్వం క్రింద అభివృద్ధి నిరోధక రాజ్యాలన్నీ ఒక కూటమిగా ఏర్పడ్డాయి. రాజులు, చక్రవర్తులు కలిసి సంయుక్త సంఘటనగా ఏర్పడ్డాయి. తరచు ఫ్రాన్సుపై యుద్ధాలు జరుగుతుండేవి. ఫ్రాన్సుమీద ఇతర దేశా లన్నిటి కంటే ఎక్కువ శత్రుత్వం వహించిన దేశం ఇంగ్లండ్. అది ఫ్రెంచి ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఏర్పడ్డ కూటములన్నింటికీ ధనసహాయం చేసేది. ఈ యుద్ధాలు 1818 వరకు కొనసాగుతూనే ఉండేవి. మిలిటరీ అవసరాలకొద్దీ ఫ్రాన్స్, నెపోలియన్ యొక్క సైనికనియంతృత్వం క్రిందికి రావలసి వచ్చింది. 1804 లో అతడు ఫ్రెంచి సామ్రాట్టుగా ప్రకటించుకొన్నాడు. అంతకంతకు అతని అధికారం హెచ్చింది. పోర్చుగల్‌నుంచి రష్యా సరిహద్దులవరకు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో యూరపునంతటినీ అతడు ఆక్రమించుకొన్నాడు. ఈ ఆక్రమణ వల్ల ఫ్రెంచి పెట్టుబడిదారీ ఆశయాలైన ఫ్యూడల్ వ్యతిరేక సంస్కరణలు, సామాజిక పునర్నిర్మాణం దేశదేశాలకు వ్యాపించాయి. అంతేకాదు; రాజులు, చక్రవర్తులు ప్రజల్ని స్వాతంత్ర్య పోరాటంపేరుతో నెపోలియన్ "నిరంకుశత్వానికి" వ్యతిరేకంగా తమ పెత్తనాన్ని బలపరచవలసిందని ఉద్రిక్త పరచినప్పుడు (1812–'14) అనేక దేశాల్లో బ్రహ్మాండమైన ప్రజాఉద్యమాలు ప్రజ్వరిల్లాయి. జాతీయతకు ప్రాధాన్యత హెచ్చింది. జర్మనీ,ఇటలీలలోని చిన్న రాజ్యాలను అణచివేయడముద్వారా పోలెండును ఒక ప్రత్యేకరాజ్యంగా (కొంతవరకే అయినప్పటికీ) పునర్నిర్మించడంవల్లను ఆ దేశాల్లో త్వరలోనే జాతీయైక్యత సిద్ధించే సూచనలు కనుపించాయి.

వాటర్లూ యుద్ధం పూర్తిఅయి (ఈ యుద్ధంలో నెపోలియన్ పూర్తిగా ఓడిపోయాడు) 1815 లో వియన్నా కాంగ్రెస్ జరిగినతర్వాత పాతరాజులు, చక్రవర్తులు కొన్ని సంవత్సరాలవరకు నెమ్మది నెమ్మదిగా తిరిగి తలయెత్తారు. కాలప్రవాహాన్ని వెనక్కు మళ్ళించేందుకు పడరానిపాట్లు పడ్డారు. ఇంగ్లండ్ విదేశ వ్యవహారాల్లో యిరుక్కోకూడదని నిశ్చయించుకొన్నప్పటికీ, మిగతా అగ్రరాజ్యాలు, పవిత్ర కూటమి (Holy Alliance) అనే సంస్థను నిర్మించి, దానిలో సంఘటితమయ్యారు. ఈ కూటమికి నాయకులలో మొదటివాడు పూర్వం లిబరల్‌గానూ, యిప్పుడు అభివృద్ధినిరోధకుడుగానూ, ఎల్లప్పుడు మాయాస్వరూపుడుగానూ ఉండే జారు చక్రవర్తి (మొదటి అలెగ్జాండరు), రెండవవాడు ఆస్ట్రియన్ ఛాన్సలర్ మెటర్నిచ్. ఇతడు 1848 వరకు యూరపులో అభివృద్ధినిరోధకులందరికీ తలకాయగా పనిచేశాడు. వారిని ఆర్గనైజు చేయడంలో ప్రధానపాత్ర నిర్వహించాడు. వియన్నా కాంగ్రెస్‌లో నిర్ణయింపబడిన యూరపియన్ సరిహద్దులను మార్చడాని కెవరైనా ప్రయత్నిస్తే, అట్టి ప్రయత్నాలను అణచివేయడం, నిరంకుశ పరిపాలనకు వ్యతిరేకంగా బయలుదేరే ప్రజాఉద్యమాలను నాశనం చేయడం - ఇదీ పవిత్ర కూటమియొక్క ప్రధానాశయం. అందుకై అది తన సర్వశక్తులను వినియోగించింది. కాని త్వరలోనే ఆ కూటమిలో చీలికలు ఏర్పడ్డాయి. బాల్కన్ రాజ్యాల ఆక్రమణకై రష్యా సాగించిన ప్రయత్నం మొట్టమొదటి బీట. గ్రీసు, రష్యా ప్రోత్సాహంతో టర్కీమీద తిరుగుబాటు చేసింది.

మొట్టమొదటి పవిత్ర రోమన్ సామ్రాజ్యం విచ్ఛిన్న మయింది. కాని దానిస్థానంలో ఏర్పడ్డ జర్మన్ ఫెడరేషన్ యింకా బలహీనమైన రాజ్యం. అందులోకూడా ఆస్ట్రియాదే అగ్రస్థానం. జర్మన్‌రాజులు నెపోలియన్‌కు వ్యతిరేకంగా తమ ప్రజల్ని సమీకరించడానికి యిదివరలో అనేక నూతన రాజ్యాంగచట్టాలు వాగ్దానం చేశారు. కాని వాటన్నిటినీ నేడు పోలీసుల, గూఢచారుల సహాయంతో భగ్నంచేశారు. ప్రజాతంత్ర పరిపాలనకైగాని, జర్మన్ జాతీయైక్యతకైగాని, ప్రజలు సాగించిన ప్రతిఉద్యమాన్ని మొగ్గలోనే త్రుంచి వేయసాగారు. యుద్ధావసరాలకొద్దీ రష్యా వ్యవసాయ బానిస పద్ధతిని నిర్మూలించవలసి వచ్చింది. కాని, ఆధునికపద్ధతుల వైపు అది తన దృష్టిని ప్రసరింపజేయలేదు. ఆస్ట్రియా అడుగు జాడల్లోనే అది నడువసాగింది. ఇటలీలో కొత్తగా అధికారా నికి వచ్చిన ప్రభుత్వాలన్నీ ఆస్ట్రియన్‌సైనికుల సహాయంతోనే పరిపాలన సాగించాయి. ముఖ్యంగా నేపుల్స్‌లో లిబరల్స్ అంతా భయంకరమైన నిర్బంధవిధానానికి గురిచేయబడ్డారు. స్పెయిన్‌లోకూడా యిలాగే జరిగింది. అక్కడి ప్రజలు శక్తి వంతమైన గెరిల్లా ప్రతిఘటనద్వారా నెపోలియన్ సేనలను తరిమివేయడంలో చాల సహాయపడ్డారు. కాని కొత్తరాజ్యాం గానికి బద్ధుడనైయుంటానని శపథంచేసిన రాజు స్పానిష్ వీర యోధుల్ని బందిఖానాలో పెట్టాడు. పోలెండు తిరిగి ప్రక్క నున్న రాజ్యాలతో కలిపివేయబడింది.

ఆరోజుల్లో అన్ని దేశాల అభివృద్ధికాముకులు "లిబర లిజం, జాతీయత" అనే నినాదాలతో ముందుకు వచ్చారు.

ఈ రెండూ పెట్టుబడిదారీ విధానం విప్లవకరమైన పాత్ర నిర్వ హించే టప్పుడు ఇచ్చే నినాదాలు. ఈ కాలంలోనే బైరన్‌కవి తన ప్రపంచ ప్రఖ్యాతమైన స్వాతంత్ర్య గేయం రచించాడు.

ఈ రణ గర్జనలకు వ్యతిరేకంగా పవిత్రకూటమిలో చేరిన రాజ్యాలన్నీ నిలబడ్డాయి. ఈశ్వరాంశ సంభూతులమని చెప్పుకొనే రాజులు, చక్రవర్తులు, తమ "పవిత్ర" హక్కుల రక్షణకై పోరాటానికి తలపడ్డారు.

ఇటలీ, స్పెయిన్, జర్మనీదేశాల్లో ఎడ తెగకుండా తిరుగుబాట్లు జరిగాయి. కాని అవన్నీ అణచివేయబడ్డాయి. రష్యాలో సహితం 1825 లో డిసెంబరిస్టుకుట్ర అంటూ ఒక కుట్ర జరిగింది. గ్రీసుమాదిరిగానే దక్షిణ అమెరికాలోని స్పానిష్ వలసదేశాలుకూడ సంపూర్ణ స్వాతంత్ర్యం ప్రకటించుకొన్నాయి. వియన్నా కాంగ్రెస్ షరతులప్రకారం హాలెండ్‌లో లీనంచేయబడిన బెల్జియం, హాలెండునుంచి విడిపోయింది. క్రమేణ అగ్రరాజ్యాలమధ్య పోటీలు, విభేదాలు ఏర్పడ్డాయి. వాటి ఒత్తిడికి "పవిత్రకూటమి" ఛిన్నాభిన్నమయింది. 1830 లో ఫ్రాన్సులో జరిగిన విప్లవంవల్లనూ 1832 లో ఇంగ్లండులో ప్యాసైన పార్లమెంటరీ సంస్కరణ చట్టంవల్లనూ, రాజ్యాధికారం భూస్వాములనుంచి పైతరగతికి చెందిన బూర్జువావర్గానికి సంక్రమించింది. అందుచేత ఆ దేశాల్లో ప్రధానసమస్య పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా పోరాటం జరపడం. కాని ఆస్ట్రియా, ప్రష్యా, రష్యా దేశాల్లో అలాకాదు. అక్కడి సమస్య నిరంకుశ రాజరికానికి వ్యతిరేకంగా బూర్జువావర్గం జరిపే పోరాటం. ఈ రాచరిక

ప్రభుత్వాలు సగం ఫ్యూడల్ వర్గాలతోనూ, సగం నిరంకు శాధికారవర్గంతోనూ నిండి ఉండేవి. బూర్జువావర్గం ప్రష్యా యందలి పశ్చిమరాష్ట్రాలలో (రైన్‌లాండ్) ఎక్కువగా అభి వృద్ధి చెందింది. ఈ పోరాటం జర్మన్, ఇటాలియన్, స్లావ్ ప్రజల జాతీయ వాంఛలతో పెనవేసుకొని ఉంది. అట్టి పరి స్థితుల్లో బ్రహ్మాండమైన ఆర్థికమాంద్యం యూరపుఖండాన్ని ఆవరించింది. 1848 లో అది అనేక విప్లవాలకు దారితీసింది. ఆ సంవత్సరంలో జరిగిన ముఖ్యఘటనలు యివి. ఫిబ్రవరిలో పారిస్ ప్రజల తిరుగుబాటువల్ల ఫ్రెంచి రాచరిక ప్రభుత్వం కూలిపోయింది (ఇది లూయీ ఫిలిప్ ప్రభుత్వం. 1830 జులై నెలలో జరిగిన విప్లవంవల్ల అధికారానికి వచ్చింది). ఆ నెల లోనే ఫ్రాన్సులో రెండవ రిపబ్లికన్ ప్రభుత్వం ఏర్పడింది. ఇలాగే బ్రస్సెల్స్‌లోనూ, మార్చి నెలలో వియన్నా, బెర్లిన్ నగరాలలోనూ జరిగిన విప్లవాల ఫలితంగా జర్మన్ ప్రభుత్వం చట్టసమ్మత పరిపాలనకు (Constitutional Rule) ఒప్పుకో వలసివచ్చింది. మెటర్నిచ్ గాభరాతో విదేశాలకు పారి పోయాడు. మే నెలలో జర్మన్ రాజ్యాంగాన్ని తయారుచేసేం దుకు ఫ్రాంక్‌ఫర్టులో నేషనల్ అసెంబ్లీ సమావేశమయింది. ఇటలీలోనూ, ప్రష్యాలో చేర్చబడిన పోలెండ్ భాగంలోనూ, అనేక-చోట్ల తిరుగుబాట్లు జరిగాయి. ఆస్ట్రియాకు వ్యతి రేకంగా హంగేరియన్ ప్రజలు తిరుగబడ్డారు. ఇంగ్లండ్ అంతా కార్మిక ప్రదర్శనాలతో ప్రతిధ్వనించింది.

కాని, ఈ ప్రజావెల్లువ త్వరలోనే అణచివేయబడింది. పోలిష్ ప్రజల్ని ప్రష్యన్ సైనికులు కాల్చిచంపారు. ఆస్ట్రి

ఆస్ట్రియన్ జనరల్ రాడెట్జి ఇటాలియన్ ప్రజల్ని హత్య చేశారు. కొత్తగా ఏర్పడ్డ ఫ్రెంచి బూర్జువా ప్రభుత్వంపట్ల భ్రమలు తొలగించుకొన్న నిరుపేద కార్మికులు జూన్‌లో తీవ్రపోరాటాలు జరిపారు. కాని వెంటనే క్రూరమైన హింసా కాండకు గురిచేయబడ్డారు. ప్రష్యాలో కొత్తగా మంత్రి వర్గంలోకి తీసుకోబడ్డ లిబరల్స్ పిరికిపందలవలె అసహ్యంగా ప్రవర్తించారు.

అభివృద్ధి నిరోధకులు రెండవసారి దాడి ప్రారంభించే టప్పుడు ఈ లిబరల్సును మంత్రివర్గంనుంచి తరిమివేయడానికి నిశ్చయించుకున్నారు. అప్పుడు లిబరల్స్ దద్దమ్మలై ఊరకు కొన్నారు. అభివృద్ధి నిరోధకుల పెత్తనాన్ని స్వీకరించారు. ఫ్రాంక్‌ఫర్టు అసెంబ్లీలో ఉపన్యాసాలమీద ఉపన్యాసా లివ్వడం తప్ప, అదిచేసిన ఘనకార్యం ఒక్కటి లేదు. చివరకు జర్మనీ సింహాసనాన్ని అక్కర్లేదు మొర్రో అంటున్నా ప్రష్యా రాజుకు స్వాధీనం చేయడం జరిగింది. హంగరీ కార్మికులు కొసూత్ నాయకత్వాన ధైర్య సాహసాలతో పోరాడారు. కాని అభివృద్ధి నిరోధకులు వారికి వ్యతిరేకంగా, స్లావ్ మైనారి టీలకు చెందిన క్రొయేట్లనూ, స్లోవనీస్ ప్రజలనూ, సమీాక రించగలిగారు. వియన్నాలో అభివృద్ధి నిరోధకులు తిరిగి అధి కారాన్ని హస్తగతం జేసుకోవడంలో స్లావ్ మైనారిటీలు యీావిధంగా సమీాకరింపబడ్డానికి కారణం కొంతవరకు హంగరీ ప్రజలేనని చెప్పాలి. వారు భూస్వాముల నాయ కత్వాన్ని అంగీకరించి, తమ స్వాతంత్ర్యంకొరకు మాత్రమే తహతహల్లాడారు. ఇతరుల స్వాతంత్ర్యం మాట పట్టించుకో

లేదు. చివరకు 1849 లో ఒక రష్యన్ సేన హంగరీలో ప్రవే శించి, ఆస్ట్రియన్ రాజులకు తిరిగి అధికారాన్ని కట్టబెట్టింది. అభివృద్ధినిరోధక రష్యా 1848 వ సంవత్సరమంతా యూరపులో ప్రజాశక్తుల నణచడానికి సర్వవిధాల సహాయపడింది. ఈ భూతాన్ని తరిమివేసేటందుకు జర్మన్ ప్రజలు దేశభక్తియుతమైన విప్లవశక్తిని ప్రదర్శించాలనీ, జాతీయ స్వాతంత్ర్యం కోసం పోరాడాలనీ, మార్క్సు పిలుపుయిచ్చాడు.

1848 విప్లవాన్ని మనం 100 కి 100 పాళ్ళు పరాజయంగా భావించకూడదు. దానివల్ల పాతపాలకవర్గం గజగజలాడింది. ఆస్ట్రియా కొద్దికాలంలోనే వ్యవసాయబానిస పద్ధతికి స్వస్తిచెప్పవలసివచ్చింది. హంగరీకి స్వాతంత్ర్యమిచ్చి సామ్రాజ్యంలో భాగస్వామిగా తీసుకోవలసివచ్చింది. అప్పటినుంచి సామ్రాజ్యం "ద్వంద్వరాజరికం"గా వ్యవహరించింది. ఐతే, జర్మనీ, ఇటలీలలో సంపూర్ణ ఐక్యత 1870 వరకు సిద్ధించనేలేదు. పోలిష్ ప్రజలు, స్లావ్ జాతివారు 1919 వరకు విముక్తిచెందలేదు. రష్యా, ఆస్ట్రియాల రాచరిక ప్రభుత్వాలు 1917–'18 వరకు కూలిపోలేదు.

ఇక మార్క్సు, ఎంగెల్సుల కార్యకలాపాలకు వద్దాం. వారు కమ్యూనిస్టు సమితియొక్క కొత్త కేంద్రకమిటీని నిర్మించడానికి పారిస్‌లో తమ పనిని ప్రారంభించారు. ఈ సమితి సభ్యులలో అధిక సంఖ్యాకులు జర్మనీకి వెళ్ళిపోవడం వల్ల దాని నిర్మాణము కుంటుపడింది. వీరు కార్మికవర్గాన్ని ఒక స్వతంత్ర పోరాటశక్తిగా అభివృద్ధి చేయలేకపోయినప్పటికీ, వ్యక్తిగతంగా వారు చాల ధైర్యసాహసాలతో మెలగేవారు.

తర్వాత మార్క్సు, ఎంగెల్సులు రైన్‌లాండును తమ కార్య రంగంగా చేసుకున్నారు. ఆ రోజుల్లో రైన్‌లాండ్ యితర ప్రాంతాలకంటే ఎక్కువ అభ్యుదయపంథా అవలంబించేది. వీరిద్దరూ కొలోన్ నగరంలో "న్యూ రెనిష్ జీటంగ్" అనే పత్రికను స్థాపించారు. దానిద్వారా బూర్జువా లిబరల్సును ఉత్తేజపరచడం, అభ్యుదయశక్తుల్ని సమీకరించి వారిని నడిపించడం చేసేవారు. ముఖ్యంగా రైన్‌లాండ్‌లో పనిచేసే ప్రజాతంత్రవాదుల్ని ఆర్గనైజ్‌చేయడంలో మార్క్సు ప్రధానపాత్ర వహించాడు. ఒకసారి పన్నుల నిరాకరణోద్యమంలో అరెస్టు చేయబడిన రైతునాయకుల్ని విడిపించడానికి వారి తరఫున మార్క్సు కోర్టులో గట్టిగా వాదించాడు. ఉత్తేజకరమైన ఉపన్యాసంద్వారా ఆయన జూరీని ఒప్పించి, ముద్దాయిల నందరినీ విడిపించగలిగాడు. 1849 మే నెలలో మార్క్సు కొలోన్‌నుంచి వెళ్ళగొట్టబడ్డాడు. అందుచేత పత్రికకూడా ఆగిపోయింది. లండనులో ఆయనను ఎంగెల్సు కలుసుకొన్నాడు. ఎంగెల్సు అంతకుముందే జర్మనీలో అక్కడక్కడ జరిగిన కొన్ని తిరుగుబాట్లలో పాల్గొని లండన్ చేరుకున్నాడు.

మార్క్సు జీవితవిశేషాలు చాలమందికి తెలుసు. ఆయన పశ్చిమ జర్మనీలోని ట్రెవిస్ (Treves) పట్టణంలో 1818 లో జన్మించాడు. ఆయనతండ్రి ఒక ధనిక యూదు కుటుంబానికి చెందిన వకీలు. అనేక విశ్వవిద్యాలయాలలో మార్క్సు విద్య నభ్యసించాడు. మొదట తత్వశాస్త్ర పరిశోధనతో ప్రారంభించి రాజకీయాలవైపు ఆయన తన దృష్టిని మరల్చాడు. 1843–'48 వరకు పారిస్, బ్రస్సెల్సు నగరాలలో

ఉండి తన కొత్త సోషలిస్టు సిద్ధాంతాలను వివరించడంలో కాలంగడిపాడు. 1849 మొదలు 1883 వరకు అనగా మరణించేవరకు ఆయన లండన్‌లోనే గడిపాడు.

ఎంగెల్స్ జీవిత విశేషాలు చాలమందికి తెలియవు గనుక క్లుప్తంగా వాటిని వివరించడం అవసరం. 1820 లో ఈయన బార్మెన్ అనేచోట (జర్మనీ) జన్మించాడు. ఈయన తండ్రి ఒక ధనికకుటుంబానికి చెందిన పారిశ్రామికవేత్త. ఎంగెల్స్ కుటుంబమంతా పాత సాంప్రదాయాలుగల ప్రాచీన మతావలంబకులు. యవ్వనదశలో మానసిక స్వాతంత్ర్యం కోసం ఈయన తన కుటుంబంతో మతానికి వ్యతిరేకంగా పోరాడాడు. అయినా ఎల్లప్పుడు సంతోషంగా, ఆత్మవిశ్వాసంతో ఉండేవాడు. అప్పుడప్పుడు యితరులతో పరిహాసాలాడ్డంవల్ల ఉల్లాసం పొందేవాడు. కొంతకాలానికి ఎంగెల్స్ వ్యాపారంలో ప్రవేశించడంకోసం విద్యాభ్యాసానికి స్వస్తి చెప్పాడు. వ్యాపార నిర్వహణలో యీాయన కంతగా ఉత్సాహం లేకపోయినా తన పనిని పకడ్బందీగా నిర్వహించేవాడు. ప్రారంభదశలో యీాయనకు మార్క్సు మాదిరిగానే కవిత్వం వ్రాయడమంటే ఎక్కువసరదా. దీన్నికూడా ఆయన విడిచిపెట్టాడు. ఎంగెల్స్ ఎప్పుడైతే మతానికి దూరమయ్యాడో, అప్పుడు రాజకీయాల్లోకూడ ఆధునికభావాలు అలవడ్డాయి.

తర్వాత ఎంగెల్స్ సైన్యంలో కొంతకాలం పనిచేశాడు. అందుచేతనే, సైనిక వ్యూహాలంటేనూ, మిలిటరీ చరిత్రలంటేనూ ఆయనకు గాఢమైన శ్రద్ధకలిగింది. అది జీవితాంతం వరకు ఉండిపోయింది. సైన్యంనుంచి బైటికి రాగానే ఎంగెల్స్

1842 లో తన తండ్రియొక్క కంపెనీలో గుమాస్తాగా పని చేసేందుకు ఇంగ్లండ్ పంపబడ్డాడు. మార్గమధ్యంలో మార్క్సును మొట్టమొదటిసారిగా కొలోన్‌లో కలుసుకున్నాడు. అదివరకే ఆయన మార్క్సునుగురించి విన్నప్పటికి, ఇద్దరి అభిప్రాయాలు ఎక్కువదగ్గరగా ఉండేవికావు. ఇంగ్లండ్‌లో ఎంగెల్స్ 21 నెలలు ఉన్నాడు. ఆనాడు ఇంగ్లండ్ ఇతర దేశాలన్నిటికంటే పారిశ్రామికంగా అభివృద్ధిచెందింది. అందుచేత, ఎంగెల్స్ యొక్క మానసిక దృక్పథం ఎంతో విస్తరించింది. భావ వాదంపై ఆధారపడ్డ హెగెల్ గతి తార్కిక సిద్ధాంతాన్ని పరిశీలించడంతో ప్రారంభించి వాటిని ఎంగెల్స్ ఆర్థికపరిస్థితులు కన్వయించుతూ పరిశోధనలు చేశాడు. ఈ విధంగా ఆయన మార్క్సునిర్ణయాలతో ఏకీభవించడం జరిగింది. మార్క్సు కూడా హెగెల్‌యొక్క గతితార్కిక సిద్ధాంతాన్ని న్యాయ శాస్త్రానికీ, ఫ్రెంచివిప్లవ సంఘటనలకూ అన్వయిస్తూ అనేక పరిశోధనలు చేశాడు.

ఎంగెల్స్ ఇంగ్లండుకు తిరిగివచ్చినతర్వాత "ఇంగ్లండ్‌లో కార్మికుల స్థితిగతులు" అనే ప్రఖ్యాత గ్రంథం రచించాడు. అందులో ఆయన బ్రిటిష్‌ఫ్యాక్టరీకార్మికుల దారుణపరిస్థితులను బయటపెట్టడమే కాకుండా, పెట్టుబడిదారీవిధానం అంతకంతకు భారమై శిథిలమవుతుందని జోస్యంచెప్పాడు. కార్మికవర్గం సోషలిస్టు సిద్ధాంతాలవల్ల ఉత్తేజంపొంది పెట్టుబడిదారీవిధానాన్ని నాశనంచేస్తుందని రుజువుచేశాడు. "హోలీ ఫామిలీ" "జర్మన్ ఐడియాలజీ" అనే రెండు గ్రంథాలనుకూడా ఆయన మార్క్సుతో కలిసి వ్రాశాడు. "హోలీ ఫామిలీ"లో ఆనాటి

కొన్ని తప్పుసిద్ధాంతాలు విమర్శింపబడ్డాయి. "జర్మన్ ఐడియాలజీ"లో అప్పటి జర్మన్ తత్వశాస్త్రం ఖండింపబడింది. కాని ఈ గ్రంథం వెంటనే ప్రచురింపబడలేదు. ఎంగెల్స్ ఇంగ్లండులో కొన్ని వారాలు గడిపేందుకు తనతో మార్క్సును వెంటతీసుకు వెళ్ళాడు. అక్కడ మార్క్సును ఆర్థికరంగంలో పరిశోధనలు జరుపవలసిందని ప్రోత్సహించాడు. మార్క్స్ ఈ విషయంలో తీవ్రకృషిచేసి "కమ్యూనిస్టు ప్రణాళిక"ను రచించేనాటికి ఎక్కువ విషయపరిజ్ఞానం సంపాదించాడు. ఎంగెల్స్ కూడా మార్క్సువద్ద చారిత్రక భౌతికవాదాన్ని గురించి సాకల్యంగా తెలుసుకొన్నాడు. అదివరకు ఎంగెల్స్ యీ విషయాన్ని గురించి సమగ్రపరిశోధన చేయలేదు.

1848 లో విప్లవాలు పూర్తిఅయినతర్వాత ఎంగెల్స్ 1850 లో ఇంగ్లండ్‌కు వెళ్ళాడు. అక్కడ ఈయన అసామాన్యమైన ధైర్యసాహసాలతోను పట్టుదలతోను పనిచేశాడు. తర్వాత ఒక సందర్భంలో ఆయన మాట్లాడుతూ తుపాకి గుండ్లతో ప్రతిధ్వనించే రణరంగంలో ఎవరైనా సులభంగా ధైర్యసాహసాలు చూపెడతారని చెప్పాడు. ఎంగెల్స్ కార్యకలాపాలు ఆయన కుటుంబంతోగల సంబంధాన్ని పూర్తిగా త్రెంచివేసుకొనేటట్లు చేసినప్పటికీ, ఆయన తండ్రి ఫ్యాక్టరీలో కొంతకాలం గుమస్తాగానూ, తర్వాత అందులో భాగస్వామిగానూ ఉంటూ మాంచెస్టరులో స్థిర నివాస మేర్పరచుకున్నాడు. ఇది ఎంగెల్స్‌కు చాల కంటకంగా ఉండేది. అయితే ఆయన తన్ను తాను పోషించుకోవడమేకాకుండా మార్క్సునూ, మార్క్స్ కుటుంబాన్నికూడ

పోషించవలసివచ్చింది. 1845 నుంచీ, ఆయన మార్క్సుకు ధనసహాయంచేసేవాడు. ఈ సహాయం లేనట్లయితే, మార్క్సు పరిస్థితి చాల దుర్భర మయ్యేది. చాల సంవత్సరాల తర్వాత ఎంగెల్సు మాంచెస్టరు విడిచిపెట్టి లండన్‌లో నివాసమేర్పరచుకొన్నాడు. ఈ దీర్ఘకాలంలో మార్క్సు, ఎంగెల్సులు ఇద్దరూ ఉత్తర ప్రత్యుత్తరాలద్వారా దగ్గర సంబంధం కలిగియుండేవారు. "మార్క్సు-ఎంగెల్సు ఉత్తర ప్రత్యుత్తరాలు" చదివితే, ఇద్దరు ప్రజ్ఞావంతులైన మహాపురుషులు ఎలా దీర్ఘకాలం కలిసి పనిచేశారో బోధపడుతుంది. వారి కృషి ఎలా ఫలించిందో స్పష్టమవుతుంది.

ఎంగెల్సు చాలా బిడియస్తుడు. అందుచే తన ఘనత అంతా తన మిత్రుడైన మార్క్సుకు యిచ్చాడు. కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని సమగ్రరూపంలో అందచేయడానికి ఎంగెల్సు చేసిన తోడ్పాటు స్వల్పమైనదికాదు. అయినప్పటికీ, ఆ విషయం చెప్పుకోవడానికి ఎంగెల్సు సందేహించేవాడు. వారిద్దరికీ పరిచయుడైన లెఫార్గ్ ఇలా వ్రాశాడు: "మార్క్సు ఇతరుల అభిప్రాయాలకంటే ఎంగెల్సు అభిప్రాయానికి ఎక్కువ విలువనిచ్చేవాడు. నిజంచెప్పాలంటే, మార్క్సు దృష్టికి ఎంగెల్సు ఒక పెద్ద ప్రజాసమూహం. ఎంగెల్సును ఒప్పించడానికి మార్క్సు ఎంత ప్రయత్నమైనా చేసేవాడు. ఉదాహరణకు, మధ్యయుగాలలో జరిగిన ఆల్బిజెన్సిస్ మత, రాజకీయ యుద్ధానికి సంబంధించిన ఒక చిన్న విషయాన్నిగూర్చి(అది యేదో నాకిప్పుడు జ్ఞాపకంలేదు), ఎంగెల్సు అభిప్రాయాన్ని మార్చేటం

దుకు మార్క్సు అనేకగ్రంథాలు, ఒకదాని తర్వాత ఒకటి తిరుగవేయడం నే నెరుగుదును."

1883 లో మార్క్సు మరణించినప్పుడు ఎంగెల్సు చాల ఉత్తేజకరమైన ఉపన్యాసం యిచ్చాడు. అంతకు 6 సంవత్సరాలకుముందు ఎంగెల్సు "డూరింగ్ సిద్ధాంతఖండన" అనే గ్రంథం రచించాడు. అందులో డూరింగ్ అను ప్రొఫెసర్ ప్రతిపాదించిన తత్వశాస్త్ర సిద్ధాంతాలను ఖండించాడు. గతితార్కిక భౌతికవాదాన్ని బలపరచాడు. ఎంగెల్సు అనేక సమస్యలపై వ్యాసాలు, గ్రంథాలు వ్రాశాడు. మార్క్సు అసంపూర్తిగా వ్రాసి విడిచిపెట్టిన "కాపిటల్" (పెట్టుబడి) అనే గ్రంథానికి ఎంగెల్సు రెండవభాగాన్ని మూడవభాగాన్ని చేర్చి అచ్చుకు యిచ్చాడు.

ఎంగెల్సు మార్క్సు మరణానికిముందు తర్వాతకూడ కార్మిక సంస్థలను ఆర్గనైజు చేయడంలో తీవ్రంగా కృషిచేసే వాడు. ముఖ్యంగా ఇంగ్లండ్, జర్మనీలలో ఆయన ఎక్కువగా పనిచేసేవాడు.

ఎంగెల్సు 1895 లో చనిపోయాడు. ఆయన కోర్కె ననుసరించి ఆయన మృతకళేబరం దహనసంస్కారం చేయబడి సముద్రంలో కలిపివేయబడింది.

"కమ్యూనిస్టు ప్రణాళిక"ను ప్రచురించడంలో ఎక్కువగా సహాయం చేసినది ఎంగెల్సు. లెనిన్ ఈ గ్రంథాన్ని గురించి 1914 లో యిలా వ్రాశాడు:

"ఈగ్రంథం ప్రపంచాన్ని ఎంతో స్పష్టంగా, ప్రతిభావంతంగా ఒక నూతన దృక్పథంతో పరిశీలించింది. మానవుని

జీవితరంగాలన్నిటినీ సామాజిక జీవితంతో సహా భౌతికవాద దృష్ట్యా పర్యావలోకించింది. గతితార్కికవాదమే సమగ్రమైన గాఢమైన (Profound) పరిణామసిద్ధాంతమని స్పష్టంచేసింది. వర్గపోరాటాన్ని గురించి నూతన కమ్యూనిస్టు సమాజానికి సృష్టికర్త అయిన కార్మికవర్గం నిర్వహించవలసిన చారిత్రక విప్లవ పాత్రను గురించి విశదీకరించింది."

ఆగస్టు 1944. —వి. జి. కీర్నన్.



•

# పీ ఠి క

ఈ ప్రణాళిక కమ్యూనిస్టు సమితి యొక్క కార్యక్రమాన్ని వివరించేందుకు ప్రచురించబడినఒక వేదిక(Platform). కమ్యూనిస్టు సమితి మొదట ఒక జర్మన్ కార్మిక సంస్థగా బయల్దేరింది. తర్వాత అంతర్జాతీయ కార్మికసంస్థగా రూపొందింది. యూరపులో 1848 కి పూర్వంఉన్న రాజకీయ పరిస్థితుల్నిబట్టి అది రహస్యసంస్థగా పనిచేయవలసి వచ్చింది. ఈ సమితియొక్క సర్వప్రతినిధి సమావేశం (Congress) 1847 నవంబరులో లండన్‌లో జరిగింది. అది సిద్ధాంతానికీ, ఆచరణకూ సంబంధించిన పార్టీకార్యక్రమాన్ని సమగ్రరూపంలో తయారుచేయవలసిందిగా మార్క్స్, ఎంగెల్స్‌లను ఆదేశించింది. అది 1848 జనవరి నెలలో జర్మన్‌భాషలో తయారు చేయబడింది. ప్రాత ప్రతి ఫిబ్రవరి విప్లవానికి (ఫిబ్రవరి 24) కొద్దివారాలు ముందుగా లండన్‌లోని ముద్రాపకునికి పంపబడింది. ఫ్రెంచి అనువాదం పారిస్ నగరంలో 1848 జూన్‌లో తిరుగుబాటు జరిగేముందు వెలువడింది. మొదటి ఇంగ్లీషు అనువాదం "రెడ్ రిపబ్లికన్" అను లండన్ పత్రికలో ముద్రింపబడింది (1850). ఆ పత్రికకు జూలియస్ హార్నీ సంపాదకుడుగా ఉండేవాడు. అనువదించినది మిస్ హెలెన్ మేక్‌ఫర్లేన్ (Miss Helen Macfarlane) అను నామె. డేనిష్, పోలిష్ భాషలలోకూడ దాని అనువాదాలు ప్రచురించబడ్డాయి.

1848 జూన్‌లో జరిగిన పారిస్ తిరుగుబాటు శ్రామిక వర్గానికీ, పెట్టుబడిదారీవర్గానికీ మొట్టమొదటిసారిగాజరిగిన ఒక పెద్దయుద్ధం. అందులో పారిస్ కార్మికులు ఓడిపోవడంతో యూరోపియన్ కార్మికవర్గపు రాజకీయ వాంఛలూ, సామాజిక ఆశయాలూ, మళ్ళీ కొంతకాలం తిరోముఖం పట్టవలసి వచ్చింది. ఆ తర్వాత ప్రభుత్వాధికారంకోసం జరిగిన పోరాట మంతా మళ్ళీధనికవర్గానికి (Propertied class) చెందినవివిధ ముఠాలమధ్య పోరాటమే. ఫిబ్రవరి విప్లవానికి ముందుకూడా ఇంతేజరిగింది. కార్మికవర్గం తన రాజకీయహక్కులను కాపాడు కోవడంకోసమే ప్రధానంగా పోరాటం సాగించింది. ఆ పోరాటంలో అది మధ్యతరగతికి చెందిన రాడికల్‌పార్టీలో ఒక అతివాదముఠాగామాత్రమే ఉండిపోయింది. ఎక్కడైతే కార్మికోద్యమము సజీవంగా ఉన్నట్లు చిహ్నాలు కనబడేవో అక్కడల్లా అదినిర్దాక్షిణ్యంగా అణచివేయబడేది. ఉదాహరణకు ప్రష్యన్ పోలీసులు కమ్యూనిస్టుసమితియొక్క సెంట్రల్‌బోర్డుసభ్యుల్ని వేటాడి అరెస్టుచేశారు. ఆరోజుల్లో సెంట్రల్‌బోర్డు కొలోన్ నగరంలో ఉండేది. అరెస్టుచేయబడినబోర్డుసభ్యులు 18 నెలలు జైల్లో గడిపారు. 1852 అక్టోబరులో వారి విచారణ ప్రారంభ మయింది. ఇది "కొలోన్ కమ్యూనిస్టుల విచారణ" అనే పేరుతో ప్రసిద్ధికెక్కింది. అక్టోబరు 4 వ తేదీనుంచి నవంబరు 12 వ తేదీవరకు అది కొనసాగింది. ముద్దాయిలలో 7 గురికి మూడు సంవత్సరాలు మొదలు ఆరు సంవత్సరాలవరకు కఠిన శిక్ష విధించబడింది. ఒక కోటలో వారు నిర్బంధింపబడ్డారు. ఈ శిక్ష చెప్పబడిన వెంటనే కమ్యూనిస్టు సమితిని మిగతా

సభ్యులు రద్దుచేశారు. తర్వాత "కమ్యూనిస్టు ప్రణాళిక" అంధకారంలో పడిపోయినట్లు కనబడింది.

కాని యూరపియన్ కార్మికులు పాలకవర్గాలమీద మరో పోరాటం ప్రారంభించగల శక్తిని తిరిగి సంపాదించగానే అంతర్జాతీయ కార్మికసంస్థ ఉద్భవించింది (International Working Men's Association). ఇది యూరప్, అమెరికాలలో మిలిటెంటు కార్మికులనందరినీ ఒక సంఘములోకి తీసుకురావడమే తన ప్రధానకర్తవ్యంగా పెట్టుకోవడంవల్ల వెన్వెంటనే అది బాహాటంగా "ప్రణాళిక"లోని సిద్ధాంతాలను ప్రకటించ లేకపోయింది. అతివిశాలమైన కార్యక్రమంతో అది పనిచేయవలసివచ్చింది. ఆ కార్యక్రమాన్ని బ్రిటిష్ ట్రేడ్ యూనియన్లు, ఫ్రాన్సు, బెల్జియం, ఇటలీ, స్పెయిన్ దేశాలలోని ప్రౌధాన్ అనుచరులు, జర్మనీలోని లాసేల్ అనుచరులు (లాసేల్ తాను మార్క్సు శిష్యుడనేనని, అందువల్ల ప్రణాళికయందలి సిద్ధాంతాలతో ఏకీభవిస్తానని, నాతో నిరంతరం వ్యక్తిగతంగా చెప్పేవాడు. కాని 1862–'64 మధ్య అతడు తన ప్రజాందోళనలో ప్రభుత్వరుణాలపై ఆధారపడి పనిచేసే సహకార కర్మాగారాలను (Co-operative Work shops) మించి దేన్ని కోరేవాడు కాడు. అందరూ అంగీకరించే విధంగా ఆ కార్యక్రమం ఉండేది. అన్నిపార్టీలకు అంగీకార యోగ్యంగా ఆ కార్యక్రమాన్ని తయారుచేసినది మార్క్సు. కార్మికవర్గం సమిష్టి కార్యాచరణ ద్వారాను, పరస్పర చర్చలద్వారాను తప్పక తన జ్ఞానాన్ని పెంపొందించుకొంటుందని ఆయన నమ్మకం. కార్మికులు పెట్టుబడిదారీ

విధానంమీద జరిపే పోరాటంలో అనేక సంఘటనలు జరుగుతాయి. అనేక అనుభవాలు కలుగుతాయి. విజయాలకంటే పరాజయాలవల్ల వారు ఎక్కువ పాఠాలు నేర్చుకోగలుగుతారు. స్వానుభవంద్వారా, తాము గుడ్డిగా అనుసరిస్తూ వచ్చిన ప్రణాళికలలోని పొరబాట్లను గుర్తిస్తారు. అవి తమ ఆశయసిద్ధికి ఏమాత్రం పనికిరావని గ్రహిస్తారు. కార్మికవర్గం విముక్తి చెందడానికి నిజంగా ఏమేమి అవుసరమో వాటిని గురించి సమగ్రంగా తెలుసుకొనడానికి అవకాశం కలుగుతుంది. మార్క్సు అభిప్రాయం సరియైనదేనని తర్వాత రుజువయింది. 1874 లో అంతర్జాతీయ కార్మికసంస్థ రద్దయినప్పుడు కార్మికుల చైతన్యం 1864 లో కంటే ఎంతో పెంపొందింది. ఫ్రాన్సులో ప్రౌఢానిజం, జర్మనీలో లాసేలియనిజం పూర్తిగా నశించేపరిస్థితి ఏర్పడింది. పూర్వకాలపు సనాతనసిద్ధాంతాలపై పనిచేసే బ్రిటిష్ ట్రేడ్‌యూనియన్‌లలో అధికభాగం చాలకాలంక్రితమే అంతర్జాతీయ కార్మికసంస్థతో సంబంధం త్రెంచుకున్నప్పటికీ, అవికూడా క్రమేణా పురోగమించ సాగాయి. క్రిందటి సంవత్సరం స్వాన్సీలో ఉపన్యసిస్తూ బ్రిటిష్ ట్రేడ్‌యూనియన్ల అధ్యక్షుడు క్రింది విధంగా చెప్పాడు: "యూరప్ ఖండంలో వ్యాపిస్తూన్న సోషలిజంవల్ల నేడు మన కెట్టి భయం లేదు". నిజం చెప్పాలంటే "కమ్యూనిస్టు ప్రణాళిక"లోని సిద్ధాంతాలు అన్ని దేశాల కార్మికుల్లో ఎంతో ప్రభావాన్ని కలుగజేశాయి.

ఈవిధంగా "కమ్యూనిస్టు ప్రణాళిక" తిరిగి ప్రజల దృష్టిని ఆకర్షించింది. 1850 తర్వాత దాని జర్మన్ మూలం

స్విడ్జర్లండు, ఇంగ్లండు, అమెరికా దేశాల్లో అనేకసార్లు ముద్రింపబడింది. ఇంగ్లీషు తర్జుమా 1872 లో న్యూయార్కు నగరమందలి Wood Hull and Claffin's Weekly అను పత్రికలో ప్రచురింపబడింది. దాన్ని ఆధారం చేసుకొని న్యూయార్కులోనే Le Socialiste అను ఫ్రెంచి పత్రిక ఫ్రెంచి అనువాదాన్ని ప్రచురించింది. తర్వాత అమెరికాలో మరో రెండు ఇంగ్లీషు అనువాదాలైనా వెలువడ్డాయి. కాని వాటిలో మూలంలోని కొన్ని భాగాలు తుడిచివేయబడ్డాయి. ఈరెండు అనువాదాలలోను ఒకటి ఇంగ్లండ్‌లో పునర్ముద్రింప బడింది. రష్యన్ భాషలో దాన్ని మొట్టమొదట అనువదించినది బకునిన్. అది 1863 ప్రాంతంలో జెనీవాలోని Kolokol పత్రిక కార్యాలయంలో ప్రచురింపబడింది. దానికి సంపాదకుడు హెర్జెన్ అనునతడు. రెండవ రష్యన్ అనువాదంకూడా జనీవా లోనే 1882 లో వెలువడింది. వీరా జసూలిచ్ (Vera Zasulich) అను వీరవనిత దాన్ని అనువదించింది. కోపెన్ హేగన్ నగరంలోని Social Democratist Bibliothe అను పత్రికలో ఒక కొత్తడేనిష్ అనువాదం 1885 లో వెలువ డింది. మరో ఫ్రెంచి అనువాదం 1886 లో పారిస్‌లోని Le Socialiste పత్రికలో ముద్రింపబడింది. దాన్నే ఆధా రంగా తీసుకొని, 1886 లో ఒకస్పానిష్ అనువాదంకూడా ప్రచురింపబడింది. జర్మన్ భాషలో ప్రచురింపబడిన పునర్ముద్ర ణలు లెక్కలేనన్ని వున్నాయి. కనీసం డజను పునర్ముద్రణ లైనా లెక్కకు వస్తాయి. ఆర్మీనియన్ అనువాదం కాన్‌స్టాంటి నోపుల్‌లో కొద్దినెలల్రకింతం ప్రచురింపబడవలసివుంది. కాని

నాకు చేరిన భోగట్టానుబట్టి, ప్రచురణకర్తకూ - అనువాదకునికీ మధ్య పేచీవచ్చింది. ప్రచురణకర్త ఆ గ్రంథాన్ని మార్క్సు పేరుతో ప్రచురింప నిరాకరించాడు. అనువాదకుడు దాన్ని తన సొంతపేరుతో తీసుకురావడానికి యిష్టపడలేదు అనేక యితర భాషలలోకూడా "కమ్యూనిస్టు ప్రణాళిక" ప్రచురింపబడినట్లు నేను విన్నాను. కాని వాటిని నేను చూడ లేదు.

ఈ విధంగా "కమ్యూనిస్టు ప్రణాళిక"యొక్క చరిత్ర చాలవరకు ఆధునిక కార్మికోద్యమ చరిత్రను ప్రతిబింబిస్తుంది. ఈరోజున అదే సోషలిస్టు సాహిత్యమంతటిలోను ఎక్కువ ప్రచారంలో వున్న గ్రంథం. అదే అన్నిటికంటే ఎక్కువ అంతర్జాతీయ స్వభావాన్ని కలిగియుంది. సైబీరియానుంచి కాలిఫోర్నియావరకు లక్షలాది కార్మికులు దాన్నే తమ ప్రమాణ గ్రంథంగా, సమిష్టివేదిక (Common platform) గా పరిగణిస్తున్నారు.

అయితే మేము దాన్ని "సోషలిస్టు ప్రణాళిక" అని పిలువలేదు. ఆ రోజుల్లో అనగా 1847 లో "సోషలిస్టుల"మని పిలుచుకొనేవారు రెండు తరగతులకు చెందినవారు. మొదటి తరగతికి చెందినవారు అనేకరకాలైన ఊహాజనిత సామ్యవాదాన్ని నమ్మేవారు. బ్రిటన్‌లో ఓవెన్ అనుచరులు, ఫ్రాన్సులో ఫోరియర్ అనుచరులు యీ తరగతి క్రిందికే వస్తారు. వీరు అదివరకే చిన్న చిన్న ముఠాలుగా క్షీణించిపోయారు. రెండవ తరగతికి చెందినవారు ప్రపంచాన్ని మరమ్మతు చేస్తామంటూ

చినిగిపోయిన బొంతలకు మాసికలువేసే బూటకపు సామ్యవాదులు. వీరు పెట్టుబడికిగాని, లాభాలకుగాని ప్రమాదం కలుగకుండా, సమస్తమైన సాంఘిక జాడ్యాలకు చికిత్స చేస్తామంటూ ముందుకు వచ్చేవారు. ఈ రెండు తరగతులకు చెందినవారు కార్మికోద్యమంతో ఎట్టి సంబంధం పెట్టుకొనేవారు కాదు. ఉన్నతవర్గాలకు చెందిన విద్యావంతులుమాత్రమే తమకు అనుచరులుగా వస్తారని వీరి అభిప్రాయం. వీరే కాకుండా కమ్యూనిస్టులుకూడా ఆరోజుల్లో కొందరుండేవారు. రాజకీయ మార్పులు మాత్రమే సరిపోవనీ, సామాజిక వ్యవస్థ పూర్తిగా మారవలసి యుందనీ నమ్మిన కార్మికవర్గం యీ తరగతి క్రిందికి వస్తారు. కాని వారి కమ్యూనిజం మోటు సిద్ధాంతాలపైన అప్పటికప్పుడు బయల్దేరే ఉత్సాహంమీద మాత్రమే ఆధారపడి యుండేది. అయినప్పటికీ అది ప్రధాన విషయాన్ని గుర్తింపగలిగింది. కార్మికవర్గంలో తగినంతశక్తిని సంపాదించగలిగింది. ఫ్రాన్సులో క్యాబెట్ (Cabet) జర్మనీలో వీట్లింగ్ (Weitling) ప్రచారం చేసిన ఊహాజనిత కమ్యూనిజం పైమోటు సిద్ధాంతాలనుంచి పుట్టినదే. ఈ విధంగా 1847 నాటికి సోషలిజం మధ్యతరగతి ఉద్యమంగాను, కమ్యూనిజం కార్మికుల ఉద్యమంగాను రూపొందాయి. ఆనాటి యూరపులో సోషలిజానికి గౌరవ మర్యాద లుండేవి. కాని కమ్యూనిజం అందుకు పూర్తిగా వ్యతిరేకం. కార్మిక వర్గంయొక్క విముక్తి కార్మికులచేతుల్లోనే ఉందని మేము మొదటినుంచే నమ్మియుండడంచేత, పై రెండింటిలో ఏమార్గం సరియైనదో మేము సులభంగానే ఎట్టి అనుమానాలు లేకుండా

నిర్ణయించుకున్నాం. మా నిర్ణయాన్ని ఇప్పుడు మార్చుకోవలసిన అవసరంగాని, అట్టి అభిప్రాయంగాని మాకు లేదు.

"కమ్యూనిస్టుప్రణాళిక"ను మే మిద్దరం కలిసి రచించాము కనక, నే నొక విషయాన్ని స్పష్టంచేయవలసియుంది. ప్రణాళికలోని మూలసిద్ధాంతం మార్క్సుది. అదే దాని జీవకణం. ఆ సిద్ధాంతం ఏమంటే చరిత్రయొక్క ప్రతిదశలోను ఆర్థికవిధానం (అనగా వస్తూత్పత్తి, మారకం) దానినుంచి ఉద్భవించే సామాజిక వ్యవస్థ ఆ దశకంతకూ పునాదిరాయి. దానిపైనే ఆ దశయొక్క రాజకీయచరిత్ర, మానసికాభివృద్ధి ఆధారపడి ఉంటాయి. అందువల్ల మానవజాతియొక్క చరిత్ర అంతా (అనగా భూమిపై సమిష్టియాజమాన్యంగల ఆదిమ కమ్యూనిస్టు సమాజం రద్దయినతర్వాత) వర్గపోరాటాల చరిత్రయే; పీడకవర్గాలకూ, పీడితవర్గాలకూ మధ్య, పాలకవర్గాలకూ-పాలితవర్గాలకూ మధ్య జరిగే పోరాటాల చరిత్రయే; మొదటినుంచీ యీ వర్గపోరాటాలు అనేకరూపాలలో వ్యక్తమవుతూ వచ్చాయి. అవి నేడు ఏదశకు వచ్చాయంటే దోపిడీ చేయబడేవర్గం (అనగా శ్రామికవర్గం) దోపిడీచేసే పాలకవర్గం నుంచి (అనగా పెట్టుబడిదారీ వర్గంనుంచి) విముక్తి పొందాలంటే తనతో బాటు మొత్తం సమాజాన్నంతటినీ దోపిడీనుంచి, పీడననుంచి, వర్గవైరుధ్యాలనుంచి, వర్గపోరాటాలనుంచి విముక్తిచెయ్యాలి. ఈ కర్తవ్యాన్ని కార్మికవర్గం నెరవేర్చలేకపోతేతన్ను తానువిముక్తిచేసుకోవడంకూడ దుర్లభమవుతుంది.

డార్విన్ సిద్ధాంతం జీవశాస్త్రానికెలాంటిదో పైసిద్ధాంతం చారిత్రక పరిశీలనకు అలాంటిది. మే మిద్దరం క్రమంగా

ఈ నూతన సిద్ధాంతాన్ని తెలుసుకోవడానికి 1845 కు ముందే కొన్ని సంవత్సరాలనుంచీ ప్రయత్నిస్తూవచ్చాం. అందులో నా స్వంతకృషి ఎంతో తెలుసుకోవాలంటే నేను రచించిన "ఇంగ్లండులో కార్మికుల స్థితిగతులు" అనే గ్రంథం చదివితే తెలుస్తుంది. అది 1844 లో వ్రాయబడింది. నేను తిరిగి మార్క్సును బ్రసెల్సులో 1845 గ్రీష్మఋతువులో కలుసుకున్నప్పుడు ఆయన అదివరకే ఒక సమగ్రరూపంలో వివరించిన తన సిద్ధాంతాన్ని నా యెదుట ఉంచాడు. నేను పై వాక్యాలలో దాన్నెంత స్పష్టంగా చెప్పానో, అంత స్పష్టంగానూ మార్క్సు దాన్ని వివరించాడు.

మే మిద్దరం కలిసి 1872 లో జర్మన్ కూర్పుకు పీఠిక వ్రాస్తూ యిలా చెప్పాము:

"కమ్యూనిస్టు ప్రణాళిక ప్రచురింపబడ్డాక యీ 25 సంవత్సరాలకాలంలోను పరిస్థితులెంతో మార్పు చెందిన మాట నిజమే. అయినా అందలి మూలసూత్రాలు 25 సంవత్సరాలక్రితం ఎంతసరియైనవో, యిప్పుడుకూడా మొత్తంమీద అంతే సరియైనవి. అక్కడక్కడమాత్రం కొన్ని వివరాలను ఇంకా చక్కజేయవచ్చు. ప్రణాళికలోనే చెప్పబడినట్లు, అందలి మూలసూత్రాలను అన్వయించడంలో దేశకాలపరిస్థితుల్ని మాత్రం దృష్టిలో ఉంచుకోవాలి. కనుకనే రెండవ సెక్షన్ చివరనున్న విప్లవకార్యక్రమాన్ని మేము అంతగా నొక్కి చెప్పడం జరగలేదు. ఆభాగాన్ని యీనాడు అనేక విషయాల్లో మార్పు చేయవలసివస్తుంది. కొన్ని మాటలకు బదులు కొత్త మాటలు చేర్చవలసి యుంటుంది. 1848 తర్వాత ఆధునిక

పరిశ్రమలు బ్రహ్మాండంగా అభివృద్ధిచెందాయి. తత్ఫలితంగా కార్మికవర్గం అదివరకుకంటే చక్కగాను, విశాలభూభాగంలోను, సంఘటితపడింది. ఫిబ్రవరివిప్లవం అంతకంటే ఎక్కువగా పారిస్‌కమ్యూన్, కార్మికవర్గానికి కావలసినంత అనుభవాన్ని యిచ్చాయి. పారిస్ కార్మికులు మొట్టమొదటిసారిగా రెండు నెలలవరకు రాజకీయాధికారం చెలాయించారు. ఇలాంటి పరిస్థితుల్లో, పై కార్యక్రమమందలి కొన్ని వివరాలు పాతపడి పోయాయనే చెప్పాలి. పారిస్‌కమ్యూన్ మనకు నేర్పినపాఠం ఏమంటే, కార్మికవర్గం పాతరాజ్యాంగ యంత్రాన్ని ఉన్నదివున్నట్లు స్వాధీనం చేసుకోవడంవల్ల ఉపయోగం ఉండదు. దాన్ని తన ప్రయోజనాల నీడేర్చుకోవడానికొక సాధనంగా వినియోగించుకోవచ్చుననుకోవడం పొరపాటు. ("ఫ్రాన్సులో అంతర్యుద్ధం" అనే గ్రంథం, అంతర్జాతీయ కార్మికసంస్థయొక్క జనరల్ కౌన్సిల్ సమావేశంలో యివ్వబడిన ఉపన్యాసం చదవండి. వాటిలో ఈ విషయం యింకా విపులంగా చర్చించబడింది.) అంతేగాక, ప్రస్తుత పరిస్థితులతో పోల్చి చూస్తే యీ ప్రణాళికలో సోషలిస్టు సాహిత్యాన్నిగురించి ఉన్న విమర్శన చాలదనే విషయం స్పష్టం. ఎందుచేతనంటే ఆ విమర్శన 1847 కు ముందు ప్రచురింపబడిన సాహిత్యానికి మాత్రమే సంబంధించిఉంది. మరోవిషయం ఏమంటే నాల్గవ సెక్షన్‌లో వివిధ ప్రతికూలపక్షాలయెడ కమ్యూనిస్టుల వైఖరిని వివరిస్తూ వ్రాసిన వాక్యాలు సిద్ధాంతరీత్యా నేటికికూడా సరియైనవే అయినప్పటికీ, నేటివాస్తవిక పరిస్థితుల్లో అవిపాతబడిపోయాయి. కారణం, నేడు రాజకీయ పరిస్థితులు పూర్తిగా

మారిపోవడమే. చరిత్ర ఆనాటి అనేక రాజకీయపార్టీలను ప్రపంచంనుంచి తుడిచివేసింది.

"అయినప్పటికీ, కమ్యూనిస్టు ప్రణాళిక ఒకచారిత్రిక రచన. దాన్ని మార్చడానికి మనకు హక్కులేదు."

దీన్ని అనువదించినది శామ్యూయల్ మూర్ (Samuel Moore). ఈయనే మార్క్సుయొక్క "పెట్టుబడి" అనే గ్రంథాన్నికూడ అనువదించాడు. ఈ ప్రణాళికను మేమిద్దరం కలిసి సంస్కరించాం. అక్కడక్కడమాత్రం చరిత్రకు సంబంధించిన కొన్ని వివరాలను స్పష్టీకరించడానికి నేనే కొన్ని వ్యాఖ్యలను చేర్చాను.

లండన్,
జనవరి 30,1883.

ఫ్రెడరిక్ ఎంగెల్స్



# కమ్యూనిస్టు ప్రణాళిక

## కారల్‌మార్క్స్, ఫ్రెడరిక్ ఎంగెల్స్

నేడు యూరపుఖండాన్ని కమ్యూనిజంఅనే బ్రహ్మరాక్షసి ఆవహించింది. దాన్ని భూస్థాపితం చేయడానికి యూరపియన్ పాలకవర్గాలన్నీ - పోప్‌మతాధిపతి, జార్ చక్రవర్తి, మెటర్నిచ్, గ్యూజో, ఫ్రెంచి రాడికల్స్, జర్మన్ సి. ఐ. డి. లు (1) కలసి పవిత్రకూటమిగా ఏర్పడ్డారు.

ప్రభుత్వంలో అధికారం చేస్తున్న ప్రతిపార్టీ తన్ను వ్యతిరేకించే యితర పార్టీలన్నింటినీ కమ్యూనిస్టు పార్టీలనడం జరుగుతోంది. అంతేకాదు. ప్రతి వ్యతిరేకపక్షం తనకంటే ఎక్కువ అభివృద్ధిచెందిన (More advanced) యితర వ్యతిరేక పక్షాలనేకాక, తన్ను వ్యతిరేకించే అభివృద్ధినిరోధక పార్టీలను కూడ కమ్యూనిస్టు పార్టీలని ఖండించడం జరుగుతోంది.

దీన్నిబట్టి రెండు విషయాలు స్పష్ట మవుతున్నాయి.

1. యూరపియన్ పార్టీలన్నీ ఇప్పటికే కమ్యూనిజాన్ని ఒక బలవత్తరమైన శక్తిగా గుర్తిస్తున్నాయి.

2. కమ్యూనిస్టులు బహిరంగంగా ప్రపంచానికంతకూ తెలిసేటట్లు తమఅభిప్రాయాలను, ఆశయాలను, పోకడలను ప్రక

టించవలసిన సమయం వచ్చింది. కమ్యూనిజాన్ని బ్రహ్మరాక్షసిగా చిత్రించేవారి పుక్కిటిపురాణాన్ని పటాపంచలు చేయడానికి పార్టీతరఫున ఒక ప్రణాళికను ప్రచురింపవలసిన అవసరమేర్పడింది.

ఇందుకోసమే, వివిధజాతులకు చెందిన కమ్యూనిస్టులు లండన్‌లో సమావేశమై యీ క్రింది ప్రణాళికను ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మన్, ఇటాలియన్, ఫ్లెమిష్, డేనిష్ భాషల్లో ప్రచురించడానికొక 'స్కెచ్'ని (స్థూలరూపం) తయారు చేశారు.

---

# 1

# పెట్టుబడిదారులు - శ్రామికులు *

ఇంతవరకు మానవజాతియొక్క చరిత్ర ♦
అంతా వర్గపోరాటాల చరిత్రయే.

---

* పెట్టుబడిదారులంటే (బూర్జువా) అర్థం, ఆధునిక ప్రపంచంలో సొంతంగా సామాజికోత్పత్తి సాధనాలను (Social means of production) కలిగియుంటూ, కార్మికులచే కూలికి పనిచేయించుకునేవర్గం. శ్రామికులంటే, సొంత ఉత్పత్తిసాధనాలు లేకుండా కేవలం తమ శ్రమశక్తిని అమ్ముకొని జీవించే ఆధునిక కార్మికవర్గం - ఎంగెల్స్.

♦ ఇక్కడ చరిత్రఅంటే అర్థం లిఖితచరిత్ర. లిఖితచరిత్రకు ముందు ప్రపంచములో ఎట్టిసామాజికవ్యవస్థఉండేదో 1847 నాటికెవరికీ తెలియదు.

స్వతంత్రుడు - బానిస (Free man and slave), సామంతుడు - సామాన్యుడు (Patrician and Plebian), ప్రభువు-అర్ధ బానిస (Lord and serf), వృత్తియజమాని*- వృత్తిపనివాడు (Guild master and journey man) ఒక్కమాటలో చెప్పాలంటే పీడించేవారు, పీడింపబడేవారు ఒకరిపై ఒకరు ఎడతెగని పోరాటాలు సాగిస్తూవచ్చారు. ఈ పోరాటా లొకప్పుడు బహిరంగంగాను, ఒకప్పుడు పైకి కనబడకుండాను జరిగేవి. వాటి పర్యవసానంగా, ప్రతిసారి

---

తర్వాత హాక్స్థాసెన్ (Haxthausun : 1792 - 1886) అను నతడు రష్యన్ ప్రజ లొకానొకప్పుడు భూమిపై సమిష్టి యాజమాన్యాన్ని కలిగి యుండేవారని కనిపెట్టాడు. మౌరర్ (Maurer) అను నతడు ట్యూటన్ జాతులన్నీ అట్టి సామాజిక ప్రాతిపదికపైననే ఉద్భవించినట్లు రుజువుచేశాడు. ప్రతిచోటు-ఇండియా మొదలు ఐర్లండువరకు - ఆదిమ సమాజం గ్రామ పంచాయతీలరూపంలో ఉండేదనికూడ తెలియజేశాడు. మోర్గన్ (Morgan) అనునతడు (1818 - 1861) ఆదిమ కమ్యూనిస్టు సమాజంయొక్క నిర్మాణ రూపాన్ని ఎంతో వివరంగా, స్పష్టంగా చిత్రించాడు. ఆదిమ తెగలకూ, గణాలకూ (Gens)గల వాస్తవసంబంధాన్ని అతడు విశదపరచాడు. ఆదిమ తెగలు విచ్ఛిన్నం కాగానే, మానవసమాజం వివిధవర్గాలుగా విభజింపబడింది. ఇవే క్రమంగా శత్రువర్గాలుగా తయారయాయి. ఆదిమ తెగలు ఏవిధంగా విచ్ఛిన్న మయాయో, సమాజం వేర్వేరు వర్గాలుగా ఏవిధంగా విభజింపబడిందో నేను నా "కుటుంబం, సొంతఆస్తి, రాజ్యాంగయంత్రాల పుట్టుపూర్వోత్తరాలు" (Origin of the family, Private property and the State) అనే గ్రంథంలో వివరించడానికి ప్రయత్నించాను. —ఎంగెల్స్.

* వృత్తి యజమాని తన వృత్తిసంఘంలో పూర్తిహక్కులుగల సభ్యుడు. సంఘంలోని అనేకమంది యజమానుల్లో అతడుకూడ ఒక యజమాని. అంతేగాని, వృత్తి సంఘానికంతకూ అతడు యజమాని కాడు.

—ఎంగెల్స్.

సామాజిక వ్యవస్థ విప్లవపంథాలో పునర్నిర్మింపబడ్డమో, లేక ఆ వర్గాలు నశించి పోవడమో జరిగేది.

చరిత్రయొక్క ప్రారంభయుగాల్లో మానవసమాజం ఇంచుమించు ప్రతిచోట అనేక అంతరువులుగా, ఒకదానిక్రింద ఒకటిఉండేది. ఉదాహరణకు, ప్రాచీన రోమన్ సామ్రాజ్యంలో సామంతులు (Patricians), వర్తక నిపుణులు (Knights), సామాన్యులు (Plebians), బానిసలు (Slaves) ఉండేవారు. * మధ్యయుగాల్లో లార్డులని పిలువబడే ఫ్యూడల్ భూస్వాములు (Lords), సేరీనౌకర్లు (Vassals), వృత్తియజమానులు (Guildmasters), వృత్తిపనివారు (journey

* రోమన్ సామ్రాజ్యంలో సామంతులంటే ధనవంతులుగా ఉంటూ, అన్నిపనులూ బానిసలచేత చేయించుకొనేవారు. వీరు సమాజంలో పై అంతస్థుకు చెందినవారు. పాలకవర్గంకూడ వీరే. వర్తకనిపుణులు పట్టణాలలో అన్నివిధాలైన సరుకులు అమ్మకం, కొనకంవృత్తిగా పెట్టుకొని వడ్డీ వ్యాపారంకూడ చేసేవారు. సామాన్యులు బానిసలచేత పనిచేయించుకొనే స్తోమతలేకుండా, సాధారణ పౌరులుగానే జీవించేవారు. ఈ మూడు వర్గాలకు చెందినవారికి వోటింగ్ హక్కు ఉండేది. ప్రభుత్వ సంస్థల్లో ప్రాతినిధ్యం ఉండేది. కాని ప్రభుత్వంలో ప్రాబల్యంమాత్రం సామంతులదే. ఇక బానిసలు పైవర్గాలవారిచేత పనిముట్లుగా మాత్రమే ఉపయోగించుకొనబడేవారు. వారిని యజమాని అమ్మవచ్చు, కొనవచ్చు, లేదా చంపివేయవచ్చు. కుటుంబంతో జీవించే హక్కుకూడ వారికిలేదు. భార్యాభర్తలుగా జీవించే యిద్దరు బానిసల్ని యజమాని విడదీసి వేర్వేరుగా అమ్మివేయవచ్చు.

—అనువాదకుడు.

men) అప్రెంటిసులు, అర్ధబానిసలు (Serfs) ఉండేవారు. ఇందులో ప్రతివర్గం అనేక శాఖలుగా విభజింపబడియుండేది. ♦

---

♦ మధ్యయుగాల్లో, పశ్చిమ - మధ్యయూరపుదేశాలలో వ్యవసాయానికి పనికివచ్చే భూమి అంతా కొన్ని ఎస్టేట్లుగా (Manors) విభజింపబడియుండేది. ప్రతి ఎస్టేటుకు ఒక ప్రభువు లేదా లార్డు ఉండేవాడు. కొన్ని సందర్భాలలో ఒక్కొక్క లార్డు అనేక ఎస్టేట్లను కలిగియుండేవాడు. ప్రతిలార్డు తన ఎస్టేటులోని భూమికంతకు హక్కుదారు. అయితే కొంత భూమిని అతడు సేరిగా ఉంచుకొని, మిగతాదాన్ని ముక్కలుముక్కలుగా చేసి రైతుల కిచ్చేవాడు. ప్రతి రైతు తన కీయబడిన భూమిని సేద్యం చేసుకోనిచ్చినందుకు లార్డుయొక్క సొంత సేరిలో వారానికి రెండు, మూడురోజులు ఉచితంగా పని చేయాలి. పంటలవత్తిడిలో మొదట సేరి పనులు పూర్తిచేసిన తర్వాతనే తన పొలంలో పనిచేసుకోవాలి. కాలువలు గాని, వంతెనలుగాని, రోడ్లుగాని మరమ్మతులువస్తే, రైతు మొదట వాటిని బాగుచేయాలి. సివిల్, క్రిమినల్ అధికారాలు కూడా లార్డుల కుండేవి. రైతులు తమ భూములను విడిచిపెట్టి యితర గ్రామాలకు వెళ్ళకూడదు. అలా వెళ్తే దారుణమైన శిక్షలు విధించబడేవి. ఇట్టి రైతులందరినీ అర్ధబానిసలని పిలువవచ్చు. వీరిలో మళ్ళీ అనేక అంతరువులుండేవి. ఉదాహరణకు, సేరీ నౌకర్లు ఎల్లప్పుడూ తమ లార్డుసేరీలలోనే పనిచేయాలి. ఇతరుల మాదిరిగా వారికి భూములుండవు. బోర్డర్ లనబడేవారు. రెండు మూడు ఎకరాల భూమిని కలిగియుండేవారు. ఆ భూమి గ్రామ పొలిమేరల్లో ఉండేది. కాటర్లను ఒక్క పూరిగుడిసె తప్ప మరేమీ ఉండేవి కావు. వీరు లార్డుల సేరీలలో కూలిపని చేయాలి. అందుకు కొద్దిగా తిండిమాత్రం లభించేది. విలియన్ లనబడేవారికి కొద్దిగా స్వాతంత్ర్యం ఉండేది. వీరు చేయవలసిన వెట్టిపనులకు ఒక పరిమితి ఉండేది.

ఇక మధ్యయుగాల్లో పట్టణజీవిత మెలా ఉండేదో చూద్దాం. ఆ రోజుల్లో చిన్న చిన్న చేతిపరిశ్రమలు మాత్రమే ఉండేవి. వాటికి పెద్ద పెట్టుబడులు అవసరంలేదు. కేవలం నైపుణ్యంమీదనే సరుకులగిరాకీ ఆధారపడియుండేది. ఒక్కొక్క వృత్తి యజమాని కొంతమంది వృత్తిపనివారల

ఫ్యూడల్ సమాజపు శిథిలాలనుంచి మొలకెత్తిన పెట్టుబడిదారీ సమాజం (బూర్జువా సమాజం) వర్గ వైషమ్యాల

సహాయంతోను, అప్రెంటీసుల సహాయంతోను సరుకులు తయారుచేసేవాడు. ప్రతివృత్తి పనివాడు నిర్ణీతమైన జీతానికి యజమానివద్ద పనిచేస్తాడు. అప్రెంటీసు యజమాని ఇంట్లోనే తిండి తింటూ, కొన్ని సంవత్సరాలవరకు పని నేర్చుకుంటాడు. నిర్ణీతకాలం ముగియగానే, అతడు తన సొంత పరిశ్రమను తెరవకోవచ్చు. అందుకు తగిన స్తోమత లేకపోతే, జీతానికి ఏ యజమానివద్దనైనా చేరి పనిచేసుకోవచ్చు.

ప్రతి పట్టణంలోను వృత్తి యజమానులు వేర్వేరు వృత్తిసంఘా లేర్పరచుకొనేవారు. వీటినే గిల్డు (Guilds) లనేవారు. గిల్డులో అప్రెంటీసులు, వృత్తిపనివారు, వృత్తి యజమానులు కూడా సభ్యులుగా ఉండేవారు. ఇందుకు కారణం యజమానికీ, పనివారలకూ మధ్య భేదం అంతగా లేకపోవడమే. కొంతకాలం అప్రెంటీసుగా పనిచేసిన తర్వాతనే ఎవరైనా వృత్తి పనిచేసుకోవాలి. ఒక యజమానివద్ద పనిచేసే వ్యక్తి అతని అనుమతిలేకుండా మరో యజమానివద్దకు వెళ్ళకూడదు. ఇట్టి నిబంధనలద్వారా ప్రతి గిల్డు తన రహస్యాలను కాపాడుకొనేది. గిల్డు అధికారులు ప్రతి సరుకును పరీక్షించిన తర్వాతనే మార్కెట్టుకు పంపేవారు.

క్రమంగా గిల్డు యజమానుల్లో కొందరు ధనం కూడబెట్టి తమతోడి యజమానుల్ని హీనంగా చూడసాగారు. ప్రత్యేకమైన గిల్డులు నిర్మించుకోనారంభించారు. ఈవిధంగా పెద్ద చిన్న గిల్డులు తయారయాయి. గిల్డులలో ఉన్నతాధికారాలు ధనవంతులకే లభించేవి. పట్టణ పరిపాలనకూడ వారి క్రిందికే వచ్చేది. ఇలాగే వృత్తి యజమానులకూ - వృత్తి పనివారికీ పెద్ద అగాథమేర్పడింది. యజమాని కావడానికి నేక కఠిన పరీక్షలు ప్రవేశపెట్టబడ్డాయి. కొత్తయజమాని గిల్డుకు చెల్లించవలసిన ధనాన్ని ఎక్కువచేశారు. పాతయజమానులకు కొత్త సౌకర్యాలేర్పడ్డాయి. వృత్తిపనివారుకూడ తమ హీనస్థితిని గ్రహించగలిగారు. యజమానులబారినుండి రక్షించుకోడానికి వారు వేరే గిల్డులు స్థాపించుకోనారంభించారు. ఈ పనివారల సంఘాలు నేటి ట్రేడ్‌యూనియన్ల మాదిరిగానే హెచ్చు జీతాలకోసం పోరాటాలు సాగించేవి. వాటిని ఆనాటి ప్రభుత్వాలు అణచివేసేవి. —అనువాదకుడు.

నేమాత్రమూ నిర్మూలించలేదు సరిగదా పాతవర్గాలస్థానే కొత్తవర్గాలను, పాతదోపిడీ విధానానికి బదులు కొత్తదోపిడీ విధానాన్ని, పాతపోరాట రూపాలకు బదులు కొత్తపోరాట రూపాలను నెలకొల్పింది. అయితే, మన పెట్టుబడిదారీయుగం యొక్క ప్రత్యేక లక్షణమేమంటే, అది వర్గవైషమ్యాలను నిశితం చేసింది. మొత్తం సమాజమంతా అంతకంతకు రెండు శత్రుశిబిరాలుగా, రెండు పెద్దవర్గాలుగా చీలిపోతూంది. అవే పెట్టుబడిదారీవర్గం, శ్రామికవర్గం.

మధ్యయుగాల్లో కొత్తకొత్త పట్టణాలు వ్యాపార కేంద్రాలుగా అభివృద్ధి చెందినకొద్దీ అర్ధబానిసల్లోనుంచి అధికార పత్రాలు పొందిన వర్తకులు కొందరు (Chartered burghers) బయల్దేరారు. ఈ వర్గంనుంచే ఆధునిక పెట్టుబడిదారీవర్గం ఉద్భవించింది.*

కొంతకాలానికి సాహసవంతులు కొందరు అమెరికా ఖండాన్ని కనిపెట్టడంతోను, ఆఫ్రికాఖండానికి చివరనున్న గుడ్ హోప్ అగ్రాన్ని చుట్టిరావడంతోను అప్పుడే తలయెత్తు

---

* ప్రతిపట్టణంలోనూ వర్తకులు ఫ్యూడల్ సమాజపు నిర్బంధాలను ప్రతిఘటించడానికి సంఘాలుగా ఏర్పడసాగారు. అనేకపోరాటాల ఫలితంగా పట్టణవాసులు లార్డుల నిర్బంధాలనుంచి బయటపడ్డారు. ఏపట్టణంలోనైనా ఒక వ్యక్తి కొంత నిర్ణీతకాలం నివసిస్తే అతడు స్వతంత్రవ్యక్తిగా పరిగణింపబడేవాడు. అంతేగాక పట్టణప్రజలకు భూములపై పూర్తిహక్కులు లభించాయి. వాటి నమ్మకునేహక్కు, కొనుక్కునేహక్కు ఏర్పడింది. తర్వాత క్రమంగా కోర్టులు నడుపుకోనేహక్కుకూడా లభించింది. తమ పరిపాలనను తాము నిర్వహించుకోనేటందుకు పన్నులను వసూలుచేసే హక్కును సహితం వారు పొందగలిగారు. ఈ విధంగా పట్టణాలు ఒకటి తర్వాత ఒకటి స్వాతంత్ర్యం సంపాదించుకోగలిగాయి —అనువాదకుడు

తూన్న పెట్టుబడిదారీవర్గానికి ఎన్నో చక్కని అవకాశాలు లభించాయి. తర్వాత క్రమంగా తూర్పుఇండియా, చైనా దేశాల్లో పెద్దపెద్ద మార్కెట్లుకూడ దొరికాయి. ప్రజలు అమెరికా ఖండానికి పెద్దయెత్తున వలసపోవడం ప్రారంభమయింది. వలసదేశాల్లో వర్తకం విరివిగా అభివృద్ధికాజొచ్చింది. మారకపు సాధనాల (ద్రవ్యం) పరిమాణం, సరకుల పరిమాణం మొత్తంమీద హెచ్చాయి. వీటన్నిటివల్ల ఎగుమతి – దిగుమతి వ్యాపారం, సముద్రయానం, పరిశ్రమలు అదివరకెన్నడూ ఎరుగనంతగా అభివృద్ధిచెందాయి. ఇందుమూలంగా, శిథిలమవుతూన్న ఫ్యూడల్ సమాజంలో విప్లవశక్తులు వేగంగా అభివృద్ధి చెందసాగాయి.

ఫ్యూడల్ సమాజంలో పారిశ్రామిక విధానం కఠిన నిబంధనలతో కూడిన గిల్డుల గుత్తాధికారంక్రింద ఉండడంవల్ల నానాటికి విస్తరించే కొత్తమార్కెట్ల అవసరాలకు తగినట్లు అది అభివృద్ధిచెందలేదు. అందుచేత దానిస్థానంలో కార్ఖానాల ఉత్పత్తి విధానం (Manufacturing system) ప్రవేశించింది. కార్ఖానాలలో పెద్దయెత్తున వస్తూత్పత్తిచేసే మధ్యతరగతి వచ్చి, వృత్తియజమానుల్ని వెనక్కి నెట్టివేసింది. ఒక్కొక్క కార్ఖానాలో కొత్తగా ఏర్పడ్డ పని విభజన మూలంగా, వృత్తినిబట్టి వివిధ గిల్డులమధ్య అమల్లోఉన్న పాత పనివిభజన రద్దుచేయబడింది.

ఈలోగా మార్కెట్లు నానాటికి విస్తరించాయి. సరకులకు గిరాకీహెచ్చింది. అందువల్ల కార్ఖానాల ఉత్పత్తి పద్ధతి కూడ సరిపోలేదు. ఆవిరిశక్తి, యంత్రశక్తి ప్రవేశించడంతో

పారిశ్రామికవిధానం పూర్తిగా మారిపోయింది. అందులో బ్రహ్మాండమైన విప్లవం వచ్చింది. కార్ఖానాలస్థానంలో ఆధునిక యంత్రపరిశ్రమలు ప్రవేశించాయి. పారిశ్రామిక మధ్య తరగతి (Industrial Middle class) స్థానే అసంఖ్యాకులైన కార్మికులచే పనిచేయించుకొనే కోటీశ్వరులొచ్చారు. వీరే ఆధునిక పెట్టుబడిదారీవర్గం (బూర్జువావర్గం).

ఆధునిక యంత్రపరిశ్రమలవల్ల సరకుల మార్కెట్టు ప్రపంచానికంతకూ విస్తరించింది. అమెరికాఖండం కనిపెట్టబడ్డంతో యిది మరింత సులభమైంది. ఈ ప్రపంచమార్కెట్టు విదేశీ వ్యాపారానికి, మెట్టరహదారులకు ఎంతో ప్రోత్సాహమిచ్చింది. ఇవన్నీ తిరిగి పరిశ్రమల విస్తరణకు కారణమయాయి. పరిశ్రమలు, వ్యాపారం, నౌకాయానం, రైల్వేలు అభివృద్ధిచెందేకొద్దీ పెట్టుబడిదారీవర్గంకూడ అభివృద్ధిచెందింది. పెట్టుబడికూడ అభివృద్ధిచెందింది. మధ్యయుగాలనాటి వర్గాలు వేగంగా వెనక్కు నెట్టివేయబడ్డాయి.

ఈ విధంగా ఆధునిక పెట్టుబడిదారీవర్గం ఒక దీర్ఘకాల అభివృద్ధిక్రమంయొక్క పర్యవసానమని ఉత్పత్తి, మారకపు విధానాలలో జరిగిన అనేక విప్లవాల ఫలితమని స్పష్టము కాగలదు.

ఈ విధంగా పెట్టుబడిదారీవర్గం ఒక్కొక్క అడుగే ముందుకువేస్తూ పురోగమించేకొద్దీ రాజకీయంగా కూడ అది అభివృద్ధికాజొచ్చింది. మొదట్లో ఫ్యూడల్ లార్డ్సుల పెత్తనము క్రింద అణగిమణగియుండే వర్గం కొంతకాలానికి సాయుధమై స్వపరిపాలనాధికారంగల సంఘంగా కమ్యూన్‌లలో సంఘ

టితపడింది. ఈ వర్గం ఇటలీ, జర్మనీ దేశాల్లో మాదిరిగా సంపూర్ణ స్వాతంత్ర్యం పొందిన రిపబ్లిక్కుల హోదాతోను, ఫ్రాన్స్‌లో మాదిరిగా రాచరిక ప్రభుత్వాలకు పన్నులు చెల్లించే మూడవ ఎస్టేటు హోదాతోను బలీయమైన శక్తిగా తయారైంది. ఆ తర్వాత కార్ఖానాలదశలో ఫ్యూడల్ లార్డుల పెత్తనానికి వ్యతిరేకంగా అర్ధఫ్యూడల్ రాచరికాలను, లేదా నిరంకుశ రాచరికాలను (Absolute Monarchy) బలపరుస్తూ వాటికి సహాయం చేస్తూవచ్చింది. నిజానికి యీ వర్గం ఆనాడు పెద్ద పెద్ద రాచరిక ప్రభుత్వాలన్నింటికీ కీలకంగాఉండేది. చివరకు ఆధునిక పరిశ్రమలు, ప్రపంచ మార్కెట్టు ఏర్పడ్డంతో పెట్టుబడిదారీవర్గం ప్రత్యేకమైన రాజకీయాధికారాన్ని సంపాదించుకోగల్గింది. ఈ అధికారమే ఆధునిక ప్రాతినిధ్యపు ప్రభుత్వాల (Representative States) రూపంలో వ్యక్తమవుతోంది. * + ఆధునిక రాజ్యాంగయంత్రపు కార్యవర్గం మొత్తంపెట్టుబడిదారీవర్గంయొక్క ఉమ్మడి సమస్యలను పరిష్కరించే మేనేజింగ్ కమిటీగా పనిచేస్తూంది.

---

* ఫ్రాన్స్‌లో బాల్యావస్థలో ఉన్న పట్టణాలు ఫ్యూడల్ లార్డులనుంచి, యజమానులనుంచి స్థానికస్వపరిపాలనాధికారాన్ని సంపాదించుకున్నాయి. "మూడవ ఎస్టేటు" హోదాతో రాజకీయహక్కులను కూడ గుంజుకున్నాయి. అంతకుముందు అవి "కమ్యూన్" లనే పేరుతో వ్యవహరింపబడేవి. ఇక్కడ పెట్టుబడిదారీవర్గంయొక్క ఆర్థికాభివృద్ధికి ఉదాహరణగా ఇంగ్లడును, రాజకీయాభివృద్ధికి ఉదాహరణగా ఫ్రాన్సును పేర్కొనడం జరిగింది. —ఎంగెల్స్

+ ప్రాతినిధ్యపు ప్రభుత్వాలంటే అర్థం పార్లమెంటరీవిధానం అమల్లోఉన్న ప్రభుత్వాలు. —అనువాదకుడు.

పెట్టుబడిదారీవర్గం చారిత్రకంగా అతి విప్లవకరమైన పాత్రను నిర్వహించింది,

ఎక్కడైతే ఈ వర్గానిది పైచేయి అయిందో అక్కడల్లా ఇది భూస్వామ్య (Feudal), పితృస్వామిక (Patriarchal), భావప్రధాన (Idyllic) సంబంధాలను నిర్మూలించింది. ఫ్యూడల్ సమాజంలో కొందరు మానవులు యితరులకంటె "స్వభావసిద్ధమైన ఆధిక్యత"ను కలిగియుంటారనే అభిప్రాయం ప్రబలియుండేది. ఈ సూత్రంపై ఏర్పడ్డ రకరకాల ఫ్యూడల్ సంబంధాలు పెట్టుబడిదారీవర్గంచే నిర్దాక్షిణ్యంగా తుత్తునియలు చేయబడ్డాయి. మానవునికీ మానవునికీమధ్య అతి నగ్నమైన స్వార్థపరత్వం, నీచమైన ధనపిపాసమాత్రమే మిగిలాయి. ఇతర సంబంధాలన్నీ మాయమయ్యాయి. పూర్వం మానవుడు మతంవల్ల పొందే ఉత్తేజంతోను (Religious fervour), సాహసచర్యలవల్ల పొందే ఉత్సాహంతోను (Chivalrous enthusiasm), మూఢత్వంవల్ల కలిగే భావోద్రేకతతోను (Philistine sentimentalism) మైమరచి పారలౌకికమైన ఆనందంలో పరవశుడయేవాడు. ఆ మహదానందాన్ని పెట్టుబడిదారీవర్గం స్వార్థపరత్వమనే మంచునీటి ప్రవాహంలో ముంచివేసింది. వ్యక్తులవిలువను మారకపు విలువగా (Exchange Value) మార్చివేసింది. ప్రజలు తమ ప్రభుత్వాల నుంచి అనేక ఛార్టర్లద్వారా (అనుమతి పత్రాలు) గుంజుకున్న అసంఖ్యాకమైన స్వాతంత్ర్యాలను హరించివేసి, వాటి స్థానే స్వేచ్ఛావ్యాపారం (Free Trade) అను ఒకే ఒక నిర్దాక్షిణ్యమైన స్వాతంత్ర్యాన్ని ప్రవేశపెట్టింది. ఒక్కమాటలో చెప్పా

లంటే, మతపరాత్పర్యం, రాజకీయభ్రమలు అనే ముసుగుచే కప్పబడియున్న దోపిడీవిధానాన్ని రద్దుచేసి దాని స్థానంలో నగ్నమైన, లజ్జారహితమైన, అమానుషమైన ప్రత్యక్షదోపిడీ విధానాన్ని ప్రవేశపెట్టింది.

ఇదివరలో ప్రజలచే భక్తి గౌరవాలతో చూడబడే వృత్తుల పవిత్రతను పెట్టుబడిదారీవర్గం పటాపంచలు చేసింది. వైద్యుల్నీ, ప్లీడర్లనీ, పురోహితుల్నీ, కవుల్నీ, శాస్త్రజ్ఞుల్నీ, అందరినీ తనకు ఊడిగంచేసే కూలీలుగా మార్చేసింది.

ఫ్యూడల్‌సమాజంలో కుటుంబసంబంధాలు మూఢమైన హృదయానుబంధాల చాటున దాగియుండేవి. ఈ ముసుగును పెట్టుబడిదారీవర్గం విచ్ఛిన్నం చేసింది. వాటిని కేవలం ఆర్థిక సంబంధాలుగా మార్చివేసింది.

మధ్యయుగాలలో ఒకవైపు కష్టజీవుల పశుబలప్రదర్శనం మరోవైపు దోపిడీవర్గాల నిర్జీవమైన సోమరితనం ఒక దాని ప్రక్క ఒకటి ఉండేవి. అభివృద్ధి నిరోధకులచే ఎంతో కీర్తింపబడు యీ పరిస్థితి ఎలా సంభవమయిందో బూర్జువావర్గం బహిర్గతంచేసింది. మానవుని కార్యాచరణ ఎంతెంత పనులను సాధించగలదో మొట్ట మొదటిసారిగా వ్యక్తం చేసింది. ఈజిప్షియన్ పిరమిడ్లను, రోమన్ అక్విడక్టులను, గాథిక్ దేవాలయాలను తలదన్నిన అనేక అద్భుతాలను యిది సాధించింది. గత చరిత్రలోని జాతీయ బహుజన ప్రస్థానాలు (National Exoduses) మతయుద్ధాలు (Crusades) బూర్జువావర్గపు జైత్రయాత్రలముందు (Expeditions) ఎందుకూ కొరగావు.

ఈ వర్గం అనుక్షణమూ ఉత్పత్తి సాధనాలను (Instruments of Production) విప్లవాత్మకంగా మార్చివేయనిదే జీవించలేదు. తద్వారా ఉత్పత్తి సంబంధాలను (Relations of Production) మొత్తం సామాజిక సంబంధాలను (Relations of Society) కూడ మార్చివేస్తుంది. కాని, పూర్వకాలపు పారిశ్రామిక వర్గాల విషయం ఇలా కాదు. అవన్నీ పాత ఉత్పత్తి పద్ధతులను (Modes of Production) కాపాడ్డంద్వారానే తమ అస్తిత్వాన్ని నిలబెట్టుకోగల్గాయి. అనుక్షణం ఉత్పత్తి పద్ధతులను మార్పుచేయడం, సామాజిక సంబంధాలను కల్లోలపరచడం, శాశ్వతమైన అనిశ్చితత్వం, ఆందోళన – ఇవీ, పెట్టుబడిదారీయుగానికీ పూర్వయుగాలకూ గల ప్రధానభేదాలు. అనేక శతాబ్దాలుగా ఘనీభవించిపోయిన స్థిరసంబంధాలు, వాటితోబాటు వినయవిధేయతలతో కూడిన ప్రాచీన భావాలు, మూఢనమ్మకాలు తుడిచిపెట్టుకుపోయాయి. వాటిస్థానే ఏర్పడ్డ నవీనభావాలు తిరిగి ఘనీభవించకముందే అవికూడా పాతబడిపోతున్నాయి. ఘనరూపంలో ఉన్న ప్రతిదీ వాయురూపంగా మారిపోతుంది. పవిత్రమైనవన్నీ అపవిత్రమవుతున్నాయి. చివరకు మానవుడు ప్రశాంతంగా వాస్తవికజీవితాన్ని గురించీ, తనకూ తన తోడివారలకూగల సంబంధాన్ని గురించీ ఆలోచించనారంభించాడు.

పెట్టుబడిదారీ వర్గంచే తయారుచేయబడు సరకులన్నీ విడుదలకావాలంటే నిరంతరం ఎడతెగకుండా మార్కెట్లు విస్తరించాలి. అందువల్ల ఆ వర్గం ప్రపంచం నలువైపులకు తన ప్రాబల్యాన్ని వ్యాపింపజేసుకుంటుంది. ప్రతిచోట అది ప్రవేశించాలి. ప్రతిదేశంలోను నివాసమేర్పరచుకోవాలి.

పెట్టుబడిదారీవర్గం తన మార్కెట్లను ప్రపంచాని కంతకూ విస్తరింపజేసుకోవడంవల్ల ప్రతిదేశంలోను వస్తూత్పత్తి (Production), వస్తువినిమయం (Consumption) విశ్వ వ్యాపిత స్వభావాన్ని కలిగియున్నాయి. ఈ వర్గం అభివృద్ధి నిరోధకులందరికీ చికాకు కలిగేటట్లు పరిశ్రమలయొక్క జాతీయ పునాదుల్ని కూల్చివేసింది. చాలాకాలంక్రిందట స్థాపింపబడిన అనేక జాతీయ పరిశ్రమలను నాశనంచేసింది. ఇప్పటికీ నాశనం చేస్తూంది. వాటి స్థానే ఏర్పడ్డ నూతన పరిశ్రమలు నాగరిక జాతులన్నిటికీ ఒక జీవన్మరణ సమస్యగా తయారయాయి. ఇవి ఏ దేశంలోని ముడిపదార్థా లను ఆ దేశంలో ఉపయోగించడం కాకుండా, ఎంతో దూరంగా ఉన్న దేశాలనుంచి వచ్చే ముడిపదార్థాలతో వస్తూత్పత్తి చేస్తున్నాయి. పూర్వం ప్రజలు తమదేశంలో తయారైన సరకుల్నే కొనుక్కుంటూ, వాటితోనే తమ అవసరాలను తీర్చుకొనేవారు. కాని యిప్పుడలా కాదు, అనేక కొత్తఅవస రాలు బయల్దేరాయి. అవి తీరడానికి దూర దేశాల్లో తయా రైన సరుకులు అవసరమవుతున్నాయి. ఈ విధంగా పూర్వ కాలపు స్థానికప్రాంతాల, జాతుల స్వయంపోషక పద్ధతిపోయి, దానిస్థానే నలుదిక్కులతోను పరస్పర సంబంధా లేర్పడ్డాయి. అన్నిజాతులు ఒకదానిపై ఒకటి ఆధారపడుతున్నాయి. ఇట్టి పరిస్థితే వైజ్ఞానిక రంగంలోకూడ ఏర్పడింది. ఒక్కొక్క దేశంలో అభివృద్ధిచెందే వైజ్ఞానిక సంపద ప్రపంచంయొక్క సమిష్టి ఆస్తిగా మారుతోంది. జాతీయసంకుచితత్వం, ఒంటెత్తు జీవితం (National onesidedness and seclusion) అంత

కంతకు అసాధ్య మవుతున్నాయి. అనేక స్థానిక, జాతీయ సాహిత్యాలనుంచి విశ్వమానవ సాహిత్యం ఉద్భవిస్తోంది.

పెట్టుబడిదారీవర్గం ఉత్పత్తిసాధనాలన్నిటినీ ఎప్పటి కప్పుడు వేగంగా అభివృద్ధి చేస్తూండడంవల్ల, రవాణా సౌకర్యాలలో విపరీతమైన అభివృద్ధి రావడంవల్ల అన్ని జాతుల ప్రజలు – ఆటవిక జాతులకు చెందిన వారితో సహా – నాగరిక జీవితంలోకి యీడ్వబడుతున్నారు. పెట్టుబడిదారీవర్గంచే తయారుచేయబడు చౌకసరుకులు యెంతయెత్తు గోడలనైనా పడగొట్టగల మరఫిరంగులవంటివి. విదేశీయులయెడల ఆటవిక జాతులకుండే కరకుద్వేషాన్ని అవి తుత్తునియలు చేస్తాయి; వారిని పాదాక్రాంతులుగా చేసుకుంటాయి. ప్రతి జాతి పెట్టుబడిదారీ పద్ధతులప్రకారమే వస్తూత్పత్తిచేసేటట్లు ఈ వర్గం నిర్బంధిస్తుంది. ఇందు కంగీకరించని జాతి తుడిచిపెట్టుకు పోతుంది. నాగరికతపేరుతో సమస్తమైన పెట్టుబడిదారీ పద్ధతుల్ని ప్రవేశపెట్టేటట్లు యిది అన్ని జాతులమీద ఒత్తిడి తీసుకొస్తుంది. క్లుప్తంగా చెప్పాలంటే ఈ వర్గం సరిగ్గా తన ప్రతిబింబంవంటి ప్రపంచాన్నే సృష్టించుకొంటుంది.

పల్లెలు పట్టణాలపై ఆధారపడవలసిన పరిస్థితిని పెట్టుబడిదారీవర్గం కల్పించింది. బ్రహ్మాండమైన నగరాలెన్నింటినో అది నిర్మించింది. పల్లెటూళ్ళజనాభాతో పోల్చిచూస్తే, పట్టణాలజనాభా యెంతో యెక్కువయింది. ఈవిధంగా ప్రపంచ జనాభాలో చాలభాగాన్ని పెట్టుబడిదారీవర్గం గ్రామీణ జీవితం యొక్క మూఢత్వంనుంచి రక్షించింది. ఇలాగే అనాగరిక, అర్ధనాగరికజాతులు నాగరిక జాతులపైన, వ్యవసాయ దేశాలు

పెట్టుబడిదారీ దేశాలమీంద, ప్రాచ్య దేశాలు పాశ్చాత్య దేశాల మీంద ఆధారపడేటట్లు చేసింది.

వివిధ దేశాల్లో ప్రజలూ, ఉత్పత్తిసాధనాలూ, ఆస్తులూ, చెల్లాచెదరై ఉండే పరిస్థితిని పెట్టుబడిదారీవర్గం నిర్మూలిస్తూ వచ్చింది. విడివిడిగాఉన్న జనాభాను దగ్గరకు చేర్చింది. ఉత్పత్తి సాధనాలను కేంద్రీకృత మొనర్చింది. ఆస్తుల్ని కొద్దిమంది వ్యక్తులచేతుల్లో పెట్టింది. తత్ఫలితంగా రాజకీయ కేంద్రీకరణ (Political Centralisation) కూడ యేర్పడింది. ప్రత్యేక ప్రయోజనాలు, ప్రత్యేక చట్టాలు, ప్రత్యేక ప్రభుత్వాలు, ప్రత్యేక పన్నులవిధానం గలిగిన స్వతంత్ర రాష్ట్రాలు, లేదా పరస్పర సంబంధం అంతగాలేని రాష్ట్రాలు వేర్వేరు జాతులుగా (Nations) ఏర్పడ్డాయి.* ఒక్కొక్క జాతికి ఒక్కొక్క ప్రభుత్వం ఒక్కొక్కరకమైన చట్టాలు, ఒక్కొక్కవిధమైన వర్గ ప్రయోజనాలు, ఒక్కొక్క సరిహద్దు, ఒక్కొక్క సుంకాల పద్ధతి ఏర్పడ్డాయి.

పెట్టుబడిదారీవర్గం అధికారాని కొచ్చి నూరు సంవత్సరాలైనా పూర్తికాకముందే, ఇంత బ్రహ్మాండంగా ఉత్పత్తి శక్తులు యిదివర కెన్నడూ – గతించిన తరాలన్నిటిని కలుపుకున్నా – నిర్మింపబడియుండలేదు. మానవుడు ప్రకృతి శక్తుల్ని తనకు బానిసగా చేసుకున్నాడు. యంత్రాలతో వస్తూత్పత్తి చేయడం నేర్చుకున్నాడు. పరిశ్రమల్లోను, వ్యవసాయంలోను

---

* ఒకేభాష మాట్లాడుతూ, ఒకే ఆర్థికజీవనాన్ని, మానసికగుణాన్ని, సంస్కృతిని కలిగివుండి, ఒకే భూభాగంలో స్థిరంగా నివసిస్తూ చారిత్రకంగా పరిణామం పొందిన జనసమూహామేజాతి. —స్టాలిన్.

రసాయనిక శాస్త్రాన్ని ప్రవేశపెట్టగలిగాడు. ఆవిరిశక్తితో ఓడలు, రైళ్లు నడపడమెలాగో తెలుసుకున్నాడు. విద్యుచ్ఛక్తి సహాయంతో తంతివార్తలు పంపడం, పెద్దపెద్ద భూఖండాలను సాగులోకి తీసుకురావడం, నదీజలాలను కాల్వలద్వారా పొలాలకు మళ్ళించడం, మారుమూలల్లో ఉన్న జనసమూహాల్ని తండోపతండాలుగా ఒకచోటికి చేర్చడం - ఇవన్నీ పెట్టుబడిదారీ సమాజంలోనే సాధ్యమయాయి. సమాజం యొక్క సమిష్టిశ్రమలో (Social labour) యిలాంటి అద్భుతమైన ఉత్పత్తిశక్తులు నిద్రాణమై ఉన్నాయనే విషయం మనకు సూచనప్రాయంగానైనా ఏ గత శతాబ్దంలో తెలుసు?

దీన్నిబట్టి మనకు బోధపడేది ఏమంటే, పెట్టుబడిదారీ వర్గం కొన్ని ఉత్పత్తి మారకపుశక్తుల పునాదిపై తన సౌధాన్ని నిర్మించుకుంది. అవి ఫ్యూడల్ సమాజంలోనే ఉద్భవించాయి. క్రమేణా అవి అభివృద్ధి చెందుతూ ఒక దశకు వచ్చేసరికి, ఫ్యూడల్ సమాజంలో వస్తూత్పత్తి, వస్తువినిమయం ఏ పద్ధతుల్లో జరిగేవో, ఏ నిబంధనల ప్రకారం వ్యవసాయోత్పత్తి, కార్ఖానాల ఉత్పత్తి ఆర్గనైజు చేయబడేవో, అవి యిక పనికిరానివిగా తయారయాయి. 'ఫ్యూడల్ ఆస్థి సంబంధాలు (Feudal relation of property) ఉత్పత్తి - మారకపు శక్తులతో సమానంగా అభివృద్ధిచెందక' వాటికి సంకెళ్ళుగా పరిణమించాయి. ఈ సంకెళ్ళను బ్రద్దలు కొట్టవలసిన అవసరం ఏర్పడింది. అలా బ్రద్దలు కొట్టబడ్డాయి కూడ. వాటి స్థానే స్వేచ్ఛాయుత పోటీ పద్ధతి (Free competition) ప్రవేశించింది. దాని కనుగుణ్యంగానే సామాజిక వ్యవస్థ, రాజ్యాంగ

నిర్మాణాంకూడ యేర్పడ్డాయి. పెట్టుబడిదారీవర్గం ఆర్థికంగాను, రాజకీయంగాను అధికారానికి వచ్చింది.

ఈ రోజున మళ్ళీ యిలాంటి పరిణామమే మన కండ్ల యెదుట జరుగుతోంది. ఆధునిక పెట్టుబడిదారీ సమాజం యే ఉత్పత్తి - మారకపు సంబంధాలపైన, ఆస్తి సంబంధాలపైన ఆధారపడియుందో, అవి యీనాడు ఉత్పత్తి - మారకపు శక్తుల అభివృద్ధికి ఆటంకంగా, సంకెళ్ళుగా పరిణమించాయి. మాంత్రికుడు తన మంత్రోచ్చాటనతో సృష్టించిన పిశాచం ఆ మాంత్రికునికే యెదురు తిరిగింది. దాన్ని అదుపులో ఉంచలేక అతనెలా తబ్బిబ్బుపడతాడో, అలాగే పెట్టుబడి దారీవర్గంకూడ తనచే సృష్టింపబడ్డ బ్రహ్మాండమైన ఉత్పత్తి శక్తుల్ని అదుపులో ఉంచుకోలేక నానా అవస్థలు పడుతోంది. అనేక దశాబ్దాలుగా జరుగుతూన్న కొన్ని ఘటనలవల్ల మన కొకవిషయం బోధపడుతుంది. అది యేమంటే ఆధునిక ఉత్పత్తి పద్ధతులపై అనగా బూర్జువా ఆస్థి సంబంధాలపై ఉత్పత్తి శక్తులు జరుపుతూవచ్చిన తిరుగుబాట్ల చరిత్రయే పరిశ్రమల చరిత్ర, వ్యాపారాలచరిత్ర. నేడు పెట్టుబడిదారీ దేశాలన్నిటి లోను వ్యాపార సంక్షోభాలు (Commercial crises) కొన్ని సంవత్సరాల కొకసారి విడువకుండా వస్తున్నాయి. అవి ప్రతిసారి పెట్టుబడిదారీ సమాజాన్నంతనూ చావు బ్రతుకుల మధ్యకు తీసుకొస్తున్నాయి. ప్రతి సంక్షోభం అంతకుముందు వచ్చిన సంక్షోభాలన్నింటికంటె తీవ్రరూపం దాల్చుతోంది. ఈ సంక్షోభాలలో అదివరకే తయారై సిద్ధంగాఉన్న వస్తు సంపదలో చాలభాగం నాశనంచేయబడుతూంది. అంతేకాదు

అదివరకే తయారుచేయఁబడిన ఉత్పత్తి శక్తులలో అధికభాగం ధ్వంసం చేయఁబడుతూంది. ప్రతి సంక్షోభంలోను అధికోత్పత్తి (Over production) అనే అంటుజాడ్య మొకటి ప్రవేశిస్తుంది. ఇది ఇంతకుముందుయుగాల్లో అర్థంలేని వైపరీత్యంగా భావింపబడేది. ఈవ్యాపార సంక్షోభాలవల్ల మానవసమాజం ఒక్క సారి తాత్కాలికంగా ఆటవికదశలో ప్రవేశించినట్లవుతుంది. ఏ క్షామమో, ప్రపంచయుద్ధమో వచ్చి జీవితావసర వస్తువు లన్నిటి ధ్వంసంచేస్తున్నట్లు తోస్తుంది. పరిశ్రమలు, వ్యాపారం పూర్తిగా తుడిచిపెట్టుకుపోతున్న ట్లనిపిస్తుంది. ఇవన్నీ యెందువల్ల యిలాజరుగుతున్నాయి? నాగరికత పెచ్చుపెరగడం వల్ల, జీవితావసర వస్తువులు మేటులువేయఁడంవల్ల, పరిశ్రమలు వ్యాపారం వృద్ధిచెందడంవల్ల. అందుచేత ఈనాడు సమాజం స్వాధీనంలోవున్న ఉత్పత్తిశక్తులు పెట్టుబడిదారీ ఆస్థిసంబంధాలనేమాత్రమూ అభివృద్ధిచేసే స్థితిలో లేవు. పైగా వాటి నతిక్రమించి ముందుకు పోతున్నాయి. ఈ ఉత్పత్తిసంబంధాలు ఉత్పత్తిశక్తుల అభివృద్ధిని అరికట్టేసంకెళ్ళుగా తయారయాయి. వీటిని ఉత్పత్తిశక్తు లతిక్రమించినప్పుడల్లా పెట్టుబడిదారీ సమాజంలో వెన్వెంటనే అరాచకత్వం ప్రవేశిస్తుంది. పెట్టుబడిదారీ సమాజపు ఆస్థివిధానం సర్వనాశనమయే ప్రమాద మేర్పడుతుంది. పెట్టుబడిదారీ సమాజంచే సృష్టింపబడిన సంపదనంతటనీ యిముడ్చుకో లేనంత సంకుచితంగా, యిరుకుగా ఆ సమాజపద్ధతులు తయారయాయి. పెట్టుబడిదారీవర్గం యీ సంక్షోభాలనుంచి యెలా బయటపడజూస్తుందో కూడ చూదాం. ఒకవైపు అది తనకిష్టంలేకపోయినా ఉత్పత్తిశక్తుల్ని

పెద్దయెత్తున నాశనం చేస్తుంది. మరోవైపు కొత్తమార్కెట్లను సంపాదిస్తుంది. పాతమార్కెట్లను యిదివరకుకంటె యెక్కువగా కొల్లగొట్టుకుంటుంది. కాని, యిలా చేయడంవల్ల సంక్షోభాలు యిదివరకుకంటే యెక్కువ విస్తృతంగాను, ఎక్కువ నాశనకరం గాను తయారవుతాయి. సంక్షోభాలు రాకుండా నివారించగల అవకాశాలు ఇదివరకు కంటె అడుగంటుతాయి.

పెట్టుబడిదారీవర్గం ఏ ఆయుధాలతో ఫ్యూడల్ సమాజాన్ని నాశనం చేసిందో, ఆ ఆయుధాలే యీనాడు పెట్టుబడిదారీ వర్గాని కెదురుతిరిగాయి.

ఈ విధంగా, తన్ను నాశనంచేసే ఆయుధాలను సృష్టించుకోవడమే కాకుండా, వాటిని చేబట్టి పోరాడగల మనుష్యుల్ని కూడ - అంటే ఆధునిక కార్మికవర్గాన్ని, - శ్రామికవర్గాన్ని పెట్టుబడిదారీవర్గం సృష్టించుకుంది.

పెట్టుబడిదారీవర్గ మెంతగా అభివృద్ధి చెందుతుందో ఆ నిష్పత్తిలోనే, అంత యెక్కువగానూ శ్రామికవర్గంకూడా అభివృద్ధి చెందుతుంది. శ్రామికులంటే అర్థం, తమకు పని దొరికితేగాని జీవించలేని కార్మికులు. కాని, పనిదొరకాలంటే వారి శ్రమశక్తి ఎప్పటికప్పుడు పెట్టుబడిని వృద్ధిచేసేదిగా ఉండాలి. అనగా, శ్రామికులు తప్పనిసరిగా తమ్ముతాము యజమానులకు అమ్ముకోవాలన్నమాట. ఇతర వర్తకపు సరుకుల (Commodities) మాదిరిగానే వారు వర్తకపు సరుకులన్నమాట. అందుచేత వారుకూడ పోటీలోఉండే ఢక్కాముక్కీ లన్నిటినీ యెదుర్కోవాలి. మార్కెట్టులోని యెక్కువ తక్కువ లన్నిటినీ అనుభవించాలి.

పెట్టుబడిదారీ సమాజంలో యంత్రాలు విస్తారంగా ఉపయోగింప బడ్డంవల్లను, పనివిభజనవల్లను శ్రామికులుచేసే పనిలో వ్యక్తిత్వ లక్షణం (Individual character) నశించింది. అందుచేత కార్మికునికి తన పనియెడల ఉత్సాహం, ఆకర్షణ లేకుండా పోయింది.

అతడొక యంత్రానికి తగిలింపబడ్డ పనిముట్టుగా (Appendage) మాత్రమే ఉన్నాడు. అతడు చేయవలసిన పని బహుసులభం. దాన్ని సునాయాసంగా నేర్చుకోవచ్చు. రోజూచేసినపనినే చేస్తూఉండాలి. ఈకారణంవల్ల కార్మికుని ఉత్పత్తిఖర్చు (Cost of Production of a Workman) అతడు ప్రాణాలతో జీవించివుండడానికీ, తన వంశాన్ని అభివృద్ధి చేసుకోడానికీ అయే ఖర్చుతో సమానం. ప్రతిసరకు ఖరీదు దానికయే ఉత్పత్తిఖర్చుతో సమానంగనుక, శ్రమయొక్క ఖరీదుకూడ శ్రామికుని ఉత్పత్తిఖర్చుతో సమానం. అందువల్ల పని వ్యక్తి కెంతదూరమయితే కార్మికుని కంత తక్కువ జీతం లభిస్తుంది. అంతేకాదు యంత్రశక్తి, పని విభజన యెంతయెక్కువగా ఉంటాయో పనిభారంకూడ అంత యెక్కువగా ఉంటుంది. పనిచేసే గంటల సంఖ్యను హెచ్చించడంద్వారా గాని, చేయవలసిన పనిని, హెచ్చించడంద్వారాగాని, యంత్రంయొక్క స్పీడును హెచ్చించడంద్వారాగాని కార్మికుని పనిభారం అధికం చేయబడుతుంది.

ఆధునిక పరిశ్రమలు ప్రవేశించడంతో పితృస్వామిక యజమానుల (Patriarchal Masters) చిన్నచిన్న వర్కుషాపులన్నీ పారిశ్రామిక పెట్టుబడిదారుల ఫ్యాక్టరీలుగా మార్పు

చెందాయి. ఆ ఫ్యాక్టరీలలో పనిచేయడానికి కార్మికులు తండోపతండాలుగా వచ్చేవారు. వారందరినీ యజమానులు సైనికుల్ని ఆర్గనైజు చేసినట్లు ఆర్గనైజు చేసేవారు. సైనికులు చిన్న అధికారుల క్రింద వారిపైన పెద్ద అధికారుల క్రింద, వారిపై అజమాయిషీ చేసే ఉన్నతాధికారుల క్రింద ఉంటూ వారంతా యిచ్చే ఆజ్ఞలను శిరసావహించాలి. మన శ్రామిక సైన్యం విషయంకూడ యింతే. వీరనేక హోదాలు గల అధికారుల చెప్పుచేతల్లో ఉండాలి. వీరు పెట్టుబడిదారీ వర్గానికీ, పెట్టుబడిదారీ ప్రభుత్వానికీ ఊడిగంచేయవలసిన బానిసలు. అంతేకాదు. ప్రతిరోజు, ప్రతిగంట యంత్రంచేత, మేస్త్రీచేత, యజమానిచేత బానిసలమాదిరిగా దోచుకోబడు తున్నారు. ఈ నిరంకుశవిధానం లాభమే తన ఆశయమని యెంత బాహాటంగా ప్రకటించుకుంటుందో అంత నీచంగానూ అంత అసహ్యంగానూ, అంత వెగటుగానూ ప్రత్యక్షమౌతుంది.

కార్మికుడు తన పనిలో ఎంత తక్కువబలాన్ని, నైపుణ్యాన్ని ప్రదర్శిస్తే సరిపోతుందో అంటే ఎంత ఎక్కువగా ఆధునిక పరిశ్రమ లభివృద్ధి చెందుతాయో అంత పెద్దయెత్తున యజమానులు పురుష కార్మికులకు బదులు స్త్రీ కార్మికులచేత పని చేయించుకుంటారు. కార్మికవర్గానికి వయోభేదాలవల్లగాని, స్త్రీ పురుష భేదాలవల్ల గాని సామాజికంగా ఎట్టి ప్రత్యేక ప్రయోజనమూ కలగదు. అందరూ సమానంగా చెమటోడ్చి పనిచేయవలసిన యంత్రపు పనిముట్లు. కొందరి ఖరీదు వయస్సునుబట్టి, స్త్రీ పురుష భేదాన్నిబట్టి ఎక్కువ; కొందరిది తక్కువ. అంతే భేదం.

ఫ్యాక్టరీ యజమాని కార్మికునికి సొమ్ము రూపంలో జీతం చెల్లించిన వెంటనే అనగా ఆనాటికి కార్మికుని దోచుకోవడం పూర్తికాగానే పెట్టుబడిదారీవర్గంలో వేర్వేరు భాగాలుగా ఉన్న యితరులు - యింటియజమాని, దుకాణదారు, వడ్డీ వ్యాపారస్తుడు - కార్మికుని ముట్టడిస్తారు.

ఇక మధ్యతరగతిలో క్రింది శ్రేణికి చెందినవారు - అనగా చిన్న చిన్న వ్యాపారస్తులు, దుకాణదారులు, వ్యాపారం చాలించుకొని కూర్చున్నవారు, చేతి పరిశ్రమలవారు, రైతులు-వీరంతా క్రమేణా శ్రామికులుగా మారిపోతున్నారు. ఇందుకు రెండు కారణాలున్నాయి. మొదటిది : వీరివద్దవుండే పెట్టుబడి అతిస్వల్పం; ఆధునిక పరిశ్రమల కది సరిపోదు; పెద్ద పెద్ద పెట్టుబడిదారులతో వీరు పోటీచేయలేక తుడిచిపెట్టుకు పోతారు. రెండవ కారణం : వీరినైపుణ్యం కొత్త వుత్పత్తి పద్ధతులవల్ల వృథా అవుతుంది. ఈ విధంగా అన్ని వర్గాలకు చెందిన ప్రజల్లోనుంచి శ్రామికవర్గం కొత్తవారిని చేర్చుకుంటుంది.

ఈ శ్రామికవర్గం కొన్నిదశలవారీగా అభివృద్ధి చెందుతుంది. పెట్టుబడిదారీవర్గంతో దానిపోరాటం పుట్టుకతోనే ప్రారంభమవుతుంది. మొదట కార్మికులు వ్యక్తులుగామాత్రమే పోరాటాలు జరుపుతారు. తర్వాత ఒక ఫ్యాక్టరీలో సమిష్టిగా పనిచేసే కార్మికులంతా కలిసి పోరాటం సాగిస్తారు. ఆ తర్వాత ఒక ప్రాంతంలో ఒకే రకమైన పనిచేసే కార్మికులు తమ్ము ప్రత్యక్షంగా దోపిడీచేసే వ్యక్తిగత పెట్టుబడిదార్లమీద పోరాటాలు జరుపుతారు.

శ్రామికులు పెట్టుబడిదారీ విధానంలోవున్న వుత్పత్తి పద్ధతుల్ని ప్రతిఘటించకుండా, వుత్పత్తిసాధనాల నెదుర్కొంటారు. తాము తయారుచేసే సరుకులతో పోటీగావచ్చే విదేశీ సరకులను నాశనంచేస్తారు. ఫ్యాక్టరీలకు నిప్పంటిస్తారు. మధ్య యుగాలనాటి వృత్తి పనివారల హోదాను బలప్రయోగంతో పునరుద్ధరించడానికి ప్రయత్నిస్తారు.

ఈ దశలో కార్మికులు దేశం నలుమూలల్లోను చెల్లా చెదురుగా, పరస్పర సంబంధంలేని జనసమూహంగా వుంటారు. వారిలో వారికిగల పోటీ అనైక్యతకు దారితీస్తుంది. ఒకవేళ వారెక్కడైనా సంఘాలు స్థాపించుకోడానికి ఐక్యంకావడం సంభవిస్తే, అది పెట్టుబడిదారీవర్గంలో వున్న ఐక్యతవల్ల సాధ్యమవుతుందేగాని, కార్మికవర్గం సొంతగా ఐక్యతకోసం చేసే కృషివల్ల కాదు. పెట్టుబడిదారీవర్గం తన రాజకీయ ప్రయోజనాలను ఈడేర్చుకోడానికి శ్రామికవర్గాన్ని కూడ కదిలించవలసి వస్తుంది. అట్టిశక్తి దానికి కొంతకాలంవరకు వుంటుంది. అందు చేత, యీ దశలో శ్రామికవర్గం తన శత్రువులతో కాకుండా, శత్రువుయొక్క శత్రువుతో పోరాడుతుంది. అనగా నిరంకుశ రాచరికంయొక్క అవశేషాలతోను, భూస్వాములతోను, పారిశ్రామికేతర పెట్టుబడిదార్లతోను, పెటీ బూర్జువావర్గం తోను (మధ్యతరగతి - అను) పోరాడుతుంది. ఈ విధంగా, పెట్టుబడిదారీవర్గంయొక్క చేతుల్లో చారిత్రక గమనమంతా కేంద్రీకరింపబడుతుంది. అలా లభించే ప్రతి విజయమూ, పెట్టుబడిదారీ వర్గపు విజయమే.

కాని పరిశ్రమ లభివృద్ధి చెందేకొద్దీ శ్రామికుల సంఖ్యా బలంకూడా పెరుగుతుంది. కొన్ని నిర్ణీత కేంద్రాలలో అనేక మంది కార్మికులుచేరి పనిచేసేపద్ధతి అంతకంతకు హెచ్చు తుంది. కార్మికులశక్తి పెరగడమే కాకుండా ఆ శక్తిని వారు అంతకంతకు గుర్తిస్తారు. యంత్రాలవల్ల కార్మికుల్లోని హెచ్చు తగ్గులు నిర్మూలింపబడతాయి. ఇంచుమించు అన్ని ప్రాంతా ల్లోనూ కూలి రేట్లు ఒకేస్థాయికి, అతి హీనమైనస్థాయికి చేరు కుంటాయి. ఈ విధానం యెంత యెక్కువగా వ్యాప్తిచెందితే అంతయెక్కువగా శ్రామికులు వివిధ ప్రయోజనాలు, జీవిత పరి స్థితులు సమానస్థాయి నందుకుంటాయి. పెట్టుబడిదారీవర్గంలో పోటీలు, తత్ఫలితంగా వ్యాపార సంక్షోభాలు అంతకంత కెక్కువకావడమువల్ల, కార్మికుల జీతాలు తరచు మారిపోతూ ఉంటాయి. పరిశ్రమల్లోయెప్పటికప్పుడుకొత్తయంత్రాలుప్రవేశ పెట్టడంవల్లను, అవి యెంతో వేగంగా అభివృద్ధి చేయబడ్డం వల్లను కార్మికుల జీవితం అంతకంతకు దుర్భరమౌతుంది. కార్మికులకూ, పెట్టుబడిదారులకూ మధ్య జరిగే వ్యక్తిగత పోరాటాలు యీ రెండు వర్గాలమధ్య బ్రహ్మాండమైన వర్గ పోరాటంగా పరిణమిస్తాయి. అప్పుడు కార్మికులు పెట్టుబడిదారీ వర్గంతో పోరాడ్డానికి కావలసిన ఐక్యతకై ప్రత్యేకసంఘాలు నిర్మించుకో నారంభిస్తారు (ట్రేడ్ యూనియన్లు). తమ కూలి రేట్లను నిలబెట్టుకోడానికి సమిష్టిగా పోరాడుతారు. అప్పు డప్పుడు జరిగే యిలాంటి పోరాటాల్లో విజయాలు సంపాదించ డానికి శాశ్వతమైన కొన్ని సహాయకసంస్థలను ముందే నెల కొల్పుకుంటారు. ఇలాంటి పోరాటా లక్కడక్కడ సాయుధ సంఘర్షణలుగా మారుతాయి.

ఈ పోరాటాల్లో అప్పుడప్పుడు కార్మికులకు విజయాలు లభిస్తూవుంటాయి. కాని అవి కొంతకాలంవరకే ఉంటాయి. ఈ పోరాటాలవల్ల నిజమైన ప్రయోజనం వెంటనే లభించు ఫలితాలలో కాకుండా, యెడతెగక వ్యాప్తిచెందే కార్మికవర్గ ఐక్యతలో వుంటుంది. ఈ ఐక్యతకురవాణామార్గాల అభివృద్ధి బాగా తోడ్పడుతుంది. ఆధునిక పరిశ్రమలే ఈ అభివృద్ధికి కారణం. వాటిమూలంగానే వివిధ ప్రాంతాల్లోని కార్మికులు ఒకరితో ఒకరు సంబంధమేర్పరచుకోగల్గుతారు. ఇట్టి పరస్పర సంబంధం వుంటేనేగాని, ఒకేస్వభావంగల్గిన స్థానిక పోరాటాలన్నిటినీ దేశవ్యాపితమైన వర్గపోరాటంగా నడపడం సాధ్యపడదు. అయితే ప్రతి వర్గపోరాటం ఒక రాజకీయపోరాటమే. మధ్యయుగాల్లో రాకపోకమార్గాలు చాలహీనస్థితిలో ఉండడం వల్ల ఆనాటి వర్తకులు దేశవ్యాపితమైన ఐక్యతను సాధించడానికి కొన్ని శతాబ్దాలు పట్టింది. కాని నేడు రైల్వేలు నిర్మింపబడ్డంవల్ల కార్మికులు కొద్ది సంవత్సరాల్లోనే అట్టి ఐక్యతను సాధించగలిగారు.

ఈవిధంగా శ్రామికులు లోకేవర్గంగా యేర్పడ్డం, తత్ఫలితంగా తమ సొంత రాజకీయపార్టీని స్థాపించుకోగలగడం సాధ్యమయింది. కాని కార్మికుల్లో యెప్పటికప్పు డేర్పడే పోటీ వల్ల యీ ఐక్యత సుస్థిరంగా నిలవదు; విచ్ఛిన్నమవుతూ వుంటుంది. కాని పూర్వంకంటె నిలకడగాను, కట్టుదిట్టంగాను, ఉన్నతమైనదిగాను అభివృద్ధి చెందుతుంది. కార్మికులు పెట్టుబడిదారీవర్గంలోనేడున్న చీలికల నవకాశంగా తీసుకుని శాసనసభలద్వారా కొన్నికొన్ని కార్మికహక్కులనుసంపాదించుకోగల్గుతారు. ఇంగ్లండులో పదిగంటలబిల్లు ఈవిధంగా ప్యాసయినదే.

మొత్తంమీద పాతసమాజంలోని వివిధవర్గాల మధ్య జరిగే సంఘర్షణలన్నీ శ్రామికవర్గంయొక్క ప్రగమనాని కనేకవిధాలుగా సహాయంచేస్తాయి. పెట్టుబడిదారీవర్గం తనను వ్యతిరేకించేవారితో యెడతెగకుండా పోరాడవలసివస్తుంది. మొదట ఫ్యూడల్ భూస్వామ్యవర్గంతోను, తర్వాత పెట్టుబడి దారీవర్గంలోనే పారిశ్రామికాభివృద్ధిని వ్యతిరేకించే సెక్షన్ల తోను, నిరంతరం విదేశాల పెట్టుబడిదారీవర్గంతోను పోరాడు తుంది. ఈ పోరాటాలన్నిటిలోను పెట్టుబడిదారీవర్గం శ్రామిక వర్గంయొక్క సహాయంకోసం విజ్ఞప్తులు చేస్తుంది. తద్వారా ఆ వర్గాన్ని రాజకీయరంగంలోకి దింపుతుంది. యీ విధంగా పెట్టుబడిదారీవర్గం తాను నేర్చుకున్న సామాన్య రాజకీయ విద్యనే(Political and general education) శ్రామికవర్గాని క్కూడా నేర్పుతుంది. మరోవిధంగా చెప్పాలంటే, తనతో పోరాడ్డాని కవసరమైన ఆయుధాలన్నిటినీ పెట్టుబడిదారీవర్గమే శ్రామికవర్గానికి సప్లయి చేస్తుంది.

అంతేకాదు, ఇదివరలో మనం చూచినవిధంగా, పరిశ్రమలు నానాటికి అభివృద్ధి చెందేకొద్దీ పాలకవర్గాలనుంచే అనేక తరగతులవారు శ్రామికవర్గంలోకి ఈడ్వబడ్డమో, లేక అలాంటి పరిస్థితుల్లో జీవించవలసిరావడమో జరుగుతుంది. వీరి కలయికద్వారా శ్రామికవర్గం నూతన వికాసాన్ని పొందు తుంది. నూతన పురోగమనమార్గాన్ని చూడగల్గుతుంది.

చివరివిషయమేమంటే, వర్గపోరాటం యిటో అటో తేలిపోయే ఘడియలు సమీపించేటప్పుడు పాలకవర్గములోనే

గాక పాతసమాజ మంతటిలోను చాలకాలంగా సాగుతూన్న విచ్ఛిత్తివిధానం (Process of dissolution) విస్పష్టమైన, మహోగ్రమైన రూపం ధరిస్తుంది. తత్ఫలితంగా పాలకవర్గం లో ఒక స్వల్పభాగం చీలిపోయి, భవిష్యత్ప్రపంచాన్ని నిర్మించే విప్లవవర్గంలో చేరుతుంది. పూర్వం ఫ్యూడల్ భూసామ్య వర్గంలోనే ఒకభాగం పెట్టుబడిదారీవర్గంలో చేరినవిధంగా, యీ రోజున పెట్టుబడిదారీవర్గంలో ఒకభాగం శ్రామికవర్గంలో కలుస్తోంది. ముఖ్యంగా బూర్జువా సిద్ధాంతవేత్తలలో కొందరు చారిత్రక గమనాన్నంతటినీ అర్థంచేసుకుని శ్రామికవర్గంలో చేరుతున్నారు.

నేడు పెట్టుబడిదారీ వర్గాన్ని వ్యతిరేకించే అన్ని వర్గా ల్లోను శ్రామికులే విప్లవవర్గం. ఇతర వర్గాలన్నీ పరిశ్రమలు అభివృద్ధిచెందేకొద్దీ శిథిలమవుతాయి; చివరకవి మాయమవు తాయి. ఆధునిక పరిశ్రమలమూలంగా ఉద్భవించిన ఒక ప్రత్యేకమైన, ప్రధానమైనవర్గం శ్రామికులు.

ఇక మధ్యతరగతిలో క్రిందిశ్రేణికి చెందినవారు (Lower Middle class) - అనగా చిన్న ఉత్పత్తిదారులు, దుకాణదారులు, చేతిపరిశ్రమలవారు, రైతులు-యెల్లప్పుడూ తాము మధ్యతరగతిలోనే ఒక భాగంగా ఉండాలనికోరుతారు. తాము సాంతం తుడిచిపెట్టుకుపోకుండా, తమ అస్తిత్వాన్ని కాపాడుకొనేటందుకు పెట్టుబడిదారీవర్గంతో పోరాడుతారు. అందుచేత వీరంతా యథాతథవాదులు (Conservative) విప్లవకారులు కారు. పైగా వీరు అభివృద్ధినిరోధకులు. ఎందు చేతంటే వీరు చరిత్రయొక్క గమనాన్ని వెనక్కు త్రిప్పడానికి

ప్రయత్నిస్తారు. ఒకవేళ వీరెప్పుడైనా విప్లవపాత్రవహించడం సంభవిస్తే అది శ్రామికవర్గంలో తాము కలిసిపోయే ప్రమాదం సంభవించడంవల్ల. కాబట్టి యీ వర్గానికి చెందినవారు తమ ప్రస్తుత ప్రయోజనాలకు బదులు భవిష్యత్ప్రయోజనాలను రక్షించుకోజూస్తారు. తమ సొంత దృక్పథాన్ని విడిచిపెట్టి శ్రామికవర్గ దృక్పథాన్ని స్వీకరిస్తారు. *

---

* 1875 లో జర్మన్ సోషల్ డెమాక్రాట్లు తమ గోథా కార్యక్రమములో "కార్మికవర్గంతో యితరవర్గాలకు గల సంబంధం దృష్ట్యా ఆ యితర వర్గాలన్నీ ఒకే ఒక అభివృద్ధినిరోధకుల కూటమి" అని పేర్కొన్నారు. ఇది "కమ్యూనిస్టు ప్రణాళిక"కు వక్రభాష్యంతప్ప మరొకటికాదు. మార్క్స్ తన "గోథా కార్యక్రమ ఖండన" అనే గ్రంథంలో "కమ్యూనిస్టు ప్రణాళిక"లోని వాక్యాలను పునరుల్లేఖించి క్రిందివిధంగా వ్రాశారు.

"ఇక్కడ ఫ్యూడల్ లార్డులతోను, గిల్డులతోను (వర్తకులు) పెట్టుబడిదారీవర్గానికిగల సంబంధందృష్ట్యా పెట్టుబడిదారీవర్గం విప్లవవర్గంగా చూపబడింది. కాని ఫ్యూడల్ వర్గాలకు చెందినవారు పాత ఉత్పత్తి పద్ధతులలో బయల్దేరిన సామాజిక హోదాలన్నిటినీ స్థిరంగా ఉంచుకోవాలని కోరుతారు. అందుచేత వీరూ పెట్టుబడిదారీవర్గమూ కలిసి అభివృద్ధినిరోధకుల కూటమి అనడానికి వీల్లేదు.

"కాని మరోవైపు పెట్టుబడిదారీవర్గంతో శ్రామికవర్గానికి గల సంబంధందృష్ట్యా శ్రామికవర్గమే విప్లవవర్గం. ఎందుచేతనంటే పెద్దపెద్ద పరిశ్రమలమూలంగా జనించిన యీ వర్గం ఉత్పత్తియొక్క పెట్టుబడిదారీ స్వభావాన్ని నిర్మూలించ బూనుకొంటుంది. దాన్ని పెట్టుబడిదారీవర్గం కాపాడజూస్తుంది. కమ్యూనిస్టు ప్రణాళిక చెప్పేదేమంటే మధ్యతరగతిలో క్రింది శ్రేణికి చెందిన ప్రజలు శ్రామికవర్గంలో చేరిపోయే ప్రమాదం కనబడుతూండడంవల్ల వారు విప్లవపాత్ర వహిస్తారు."

"అందుచేత వారందరినీ పెట్టుబడిదారీవర్గంతోను, భూస్వామ్య లార్డుల తోను ముడిపెట్టి కార్మికవర్గంతో వారికిగల సంబంధంవ్యాప్తా అభివృద్ధి నిరోధకుల కూటమి అనడానికి వీల్లేదు."

"గత ఎన్నికల్లో (1874 జనవరిలో జర్మన్ రీచ్‌స్టాగ్‌కు జరిగిన ఎన్నికలు) చేతిపరిశ్రమపై జీవించేవారినీ, చిన్న ఉత్పత్తిదారుల్నీ, రైతుల్నీ సంబోధిస్తూ ఎవరైనా 'మీకూ మాకూ గల సంబంధాన్ని గట్టిమీరందరూ పెట్టుబడిదారీవర్గంతో బాటు, భూస్వామ్య లార్డులతో బాటు ఒకే ఒక అభివృద్ధినిరోధకుల కూటమి' అని చెప్పారా?"

దీన్నిబట్టి బోధపడేదేమంటే మధ్యతరగతిలో క్రిందిశ్రేణికి చెందిన ప్రజలు తమ సొంత దృక్పథాన్ని విడిచిపెట్టి శ్రామికవర్గ దృక్పథాన్ని అంగీకరించే కొద్దీ విప్లవపాత్ర వహిస్తారు. దీని అర్థం వారిలో శ్రామిక వర్గానికి మిత్రులుండరని కానేకాదు; తప్పక ఉంటారనే దీని అర్థం.

ఉదాహరణకు రైతులవిషయం చూదాం. పెట్టుబడిదారీ విధానం అభివృద్ధిచెందేకొద్దీ రైతుల్లో అనేక తారతమ్యాలేర్పడ్డం సహజం. ఒక్కొక్క తరగతికి చెందిన రైతులు సమాజంలో ఏయే స్థాన మాక్రమిస్తారో దాన్నిబట్టి వారి పాత్ర నిర్ణయింపబడుతుంది. లెనిన్ రెండవ అంతర్జాతీయ కమ్యూనిస్టు మహాసభలో రైతాంగాన్ని క్రిందివిధంగా వర్గీకరణ చేశారు!

"1. వ్యవసాయకూలీలు: వీరు పెట్టుబడిదారీపద్ధతుల్లో నడుపబడు వ్యవసాయక్షేత్రాల్లో కూలిపనిచేసుకొని జీవిస్తారు. (రోజుకూలీలు, పాలేర్లు, కట్టుబడిదార్లు ఈ తరగతిక్రిందకే వస్తారు.) వీరిని మిగతా గ్రామస్థులతో కలిపివేయక, వేరుగా సంఘటితపరచాలి."

"2. పేదరైతులు: వీరు చాలీచాలని సొంత భూమినిగాని, కౌలుకు తీసుకొన్న భూమినిగాని సాగుచేసుకుంటూరు. కాని ఆ భూమివల్ల పొట్ట నిండనందున మిగతా కాలంలో పరిశ్రమల్లోగాని, ఇతరుల పొలాల్లోగాని కూలిపని చేసుకుంటారు. ఈ తరగతికిచెందిన రైతుల పరిస్థితి చాల దుస్తరమైనది. శ్రామిక నియంతృత్వంవల్ల వీరు బాగుపడతారు. కమ్యూనిస్టుపార్టీలు నిర్మాణయుతంగాను, సక్రమంగాను పనిచేస్తే వీరంతా పార్టీకి గట్టి సైనికులుగా తయారవుతారు.

"3. చిన్నరైతులు : వీరు కొద్దిభూములమీద, కవులుకు తీసుకున్న భూములమీద ఆధారపడి వ్యవసాయంచేస్తారు. వ్యవసాయకూలీల అవసరం లేకుండానే సేద్యంచేసి కుటుంబపోషణ చేసుకుంటారు. శ్రామికవిప్లవంవల్ల వీరి కనేక సౌకర్యాలు లభిస్తాయి. శ్రామిక నియంతృత్వదశలో వీరు పూర్తిగా కాకపోయినా కొంతభాగం అయినా స్వేచ్ఛావ్యాపారంమీద, సొంత ఆస్తిమీద సర్వాధికారాలు కోరుతారు. కాని శ్రామిక ప్రభుత్వం భూస్వాములయెడ, ధనిక రైతులయెడ ఖచ్చితంగా ప్రవర్తిస్తే వీరి ఊగిసలాట చాలవరకు తగ్గుతుంది. మొత్తంమీద వీరు శ్రామికవిప్లవంపక్షానే నిలుస్తారు."

"పెట్టుబడిదారీ దేశాలన్నిటిలోను యీ మూడుతరగతుల రైతులు కలిసి గ్రామసీమల్లో అధికసంఖ్యాకులుగా ఉంటారు. అందువల్ల శ్రామిక విప్లవం పట్టణాల్లోనేకాక పల్లెలలోకూడ జయించి తీరుతుంది."

"4. మధ్యతరగతిరైతులు, వీరు తమ భూముల్ని సొంతంగా సేద్యం చేసుకుంటారు. మరికొందరు కౌలుకు తీసుకొని దున్నుకుంటారు. వ్యవసాయపు ఖర్చులు, కుటుంబఖర్చులుపోను కొద్దిగా వీరు మిగుల్చుకోగల్గుతారు. కాలంబాగుంటే ఆ ధనమే నెమ్మదిగా పెట్టుబడిగా మారుతుంది. వీరు వ్యవసాయంలో కూలీలచేత పనిచేయించుకుంటారు. లాభకాంక్ష, స్వేచ్ఛా వ్యాపారం, సొంతఆస్తిసంపాదన—ఇవి వీరి ప్రధానలక్షణాలు. అందుచేత యీ వర్గాన్ని శ్రామికవర్గం తనవైపు నిలబెట్టుకోడానికి ప్రయత్నించదు. పెట్టుబడిదారీవర్గానికీ—శ్రామికవర్గానికీ మధ్య జరిగే పోరాటంలో యీ తరగతి రైతులు తటస్థంగా ఉండేటట్లు చేసుకోవడమే కర్తవ్యం."

"5. ధనికరైతులు : వీరు కొద్దిమంది వ్యవసాయకూలీలను పెట్టుకొని పెట్టుబడిదారీపద్ధతుల్లో వ్యవసాయంచేస్తారు. జీవితపద్ధతుల్లోను, విజ్ఞానం లోను వీరు మిగతా రైతులతో సమానంగానే వెనుకబడియుంటారు. వ్యవసాయంలో కాయకష్టంకూడ చేస్తారు. ఇతరరైతులకూ, వీరికీగల పోలిక లివే. కాని వీరే గ్రామీణ పెట్టుబడిదారీవర్గంలో అధికసంఖ్యాకులు. శ్రామికప్రభుత్వానికి వీరు బద్ధశత్రువులు. కమ్యూనిస్టులు గ్రామసీమల్లో అధికసంఖ్యాకులుగా ఉండే కష్టజీవుల్ని వీరిరాజకీయ, సిద్ధాంత పలుకుడిబ నుండి విముక్తిచేయాలి. వీరికి వ్యతిరేకంగా పోరాటాలు నడపాలి..."

రైతాంగానికీ, శ్రామికవర్గానికీ మధ్య ఉండవలసిన సంబంధాన్ని గురించి లెనిన్ తన థీసిస్‌లో యిలా స్పష్టపరిచాడు:

"గ్రామీణ కష్టజీవుల్ని శ్రామికవర్గం మాత్రమే సామ్రాజ్యవాద యుద్ధాల దుష్ఫలితాలనుంచి, భూస్వాముల - పెట్టుబడిదారుల సంకెళ్ళ నుంచి కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన విముక్తి చేయగల్గుతుంది. భూస్వాముల్నీ - పెట్టుబడిదారుల్నీ కూలద్రోయడానికి శ్రామికవర్గం నడిపే విప్లవ పోరాటంలో గ్రామీణ కష్టజీవులు త్యాగబుద్ధితోను, దీక్షతోను సహకారం చేస్తేనే, వారు విముక్తు లవుతారు."

"పెట్టుబడిదారుల సంకెళ్ళనుంచి, సామ్రాజ్యవాద యుద్ధాలనుంచి ప్రజానీకాన్ని విముక్తి చేయవలసిన చరిత్రాత్మక బాధ్యత శ్రామికవర్గం మీద ఉంది. ఈ వర్గం యితరుల విషయం పట్టించుకోకుండా కేవలం తన హక్కులకొరకు, తన సౌకర్యాలకొరకు మాత్రమే పనిచేస్తే, తన చరిత్రాత్మక బాధ్యతలను నిర్వర్తింపజాలదు."

"శ్రామికవర్గం కష్టజీవు లందరితరఫున, దోచుకోబడే వారందరి తరఫున నిలబడాలి. దోపిడీ వర్గాలమీద జరిగే ప్రతి పోరాటానికీ నాయకత్వం వహించాలి. ఇందుకై వర్గపోరాటాన్ని గ్రామసీమలకు తీసుకెళ్ళాలి. గ్రామీణ కష్టజీవు లందరికీ శ్రామికవర్గ పార్టీ అయిన కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం వహించి, వారందరినీ సమీకరించాలి. పోరాటాలలో వారికి తరిఫీదు యివ్వాలి. అప్పుడే శ్రామికవర్గం నిజమైన విప్లవవర్గంగా సరియైన సోషలిస్టు పంథాలో నడుస్తున్నట్లు రుజువవుతుంది."

1905 విప్లవంనుంచి 1917 ఫిబ్రవరి విప్లవంవరకు బోల్షివిక్ పార్టీ రైతాంగమంతటి సహకారాన్ని పొందడానికి కృషిచేసింది. 1905 జులైలో లెనిన్ యిలా వ్రాశాడు:

"శ్రామికవర్గం బూర్జువా ప్రజాతంత్ర విప్లవాన్ని చివరవరకు కొనసాగించవలసి యుంది. ఈ కర్తవ్యాన్ని నిర్వహించాలంటే, జారిస్టు నిరంకుశ ప్రభుత్వపు ప్రతిఘటనను బలప్రయోగంద్వారా అణచివేయాలి; పెట్టుబడిదారీవర్గపు ఊగిసలాటను స్తంభింప జేయాలి. ఇందుకై శ్రామికవర్గం రైతాంగ మంతటి సహకారాన్ని పొందవలసి యుంటుంది."

పాతసమాజపు అట్టడుగుభాగాల్లో సంఘ తిరస్కృతులుగా ఉంటూ, క్రియా శూన్యతతో కుళ్ళి శిథిలమైపోయే "ప్రమాదకర వర్గం" అక్కడక్కడ పైకి ఉబికివచ్చి శ్రామిక విప్లవమనే మహాప్రవాహంలోకి కొట్టుకురావచ్చు. కాని వారు జీవించే పద్ధతులు చూస్తే, అభివృద్ధి నిరోధకులవద్ద లంచాలుతిని వారి కుట్రలన్నిటిలోను పనిముట్లుగా ఉపయోగపడ్డమే సాధారణంగా జరుగుతుంది.

శ్రామికవర్గంయొక్క స్థితిగతులు చూస్తే ఆ వర్గంలో పాతసమాజపు లక్షణాలేవీ కానరావు. శ్రామికునికి ఆస్తిఅనేది లేదు. అతనికీ అతని భార్యాబిడ్డలకూగల సంబంధానికి, బూర్జువాకుటుంబసంబంధాలకూ పోలిక లేనేలేదు. ఆధునిక

---

తర్వాత జారిస్టుప్రభుత్వం కూలిపోయింది. పెట్టుబడిదారీవర్గం అధికారానికి వచ్చింది. ఈ నూతనదశలో బోల్షివిక్ పార్టీ అవలంబించవలసిన వ్యూహాన్ని గురించి లెనిన్ క్రిందివిధంగా వ్రాశాడు.

"శ్రామికవర్గం పెట్టుబడిదారీవర్గపు ప్రతిఘటనను బలప్రయోగంతో అణచవలసియుంది. ఇందుకై రైతాంగంయొక్క, మధ్యతరగతిప్రజలయొక్క ఊగిసలాటను స్తంభింపచేయాలి. అర్థశ్రామికులైన ప్రజాసామాన్యపు సహకారంతో సోషలిస్టు విప్లవాన్ని విజయవంతంగా కొనసాగించాలి."

1917 నవంబరు విప్లవంలో శ్రామిక నియంతృత్వ మేర్పడింది. ఈ నూతనదశలో బోల్షివిక్కులు నిర్వహించవలసిన కర్తవ్యాలనుగూర్చి లెనిన్ యిలా వ్రాశాడు.

"మనం ధనిక రైతులతో పోరాటాన్ని ఒక్క నిమిషంకూడ ఆపు చేయం. కాని మధ్యతరగతి రైతులతోమాత్రం రాజీచేసుకోవడ మవసరం. ఇదే సమయంలో పేద రైతాంగంమీద పూర్తిగా ఆధారపడి మనం పోరాటాలు నడపాలి."

—అనువాదకుడు.

పరిశ్రమల్లో పనిచేసే కార్మికులపరిస్థితి, పెట్టుబడిదార్లక్రింద
వా రనుభవించే బానిసత్వం, ఫ్రాన్సులోఉన్నట్టే ఇంగ్లండు
లోనూ ఉంది. జర్మనీలోఉన్నట్టే అమెరికాలోనూ ఉంది.
అందుచేత యీ నూతన పరిస్థితులు శ్రామికుల్లో జాతీయలక్ష
ణాల చిహ్నాలు ఇంచుమించు లేకుండా చేశాయి. శ్రామికుల
దృష్టిలో న్యాయం (Law), నీతి (Morality), మతం
(Religion) పెట్టుబడిదార్లచే సృష్టింపబడ్డ కృత్రిమభ్రమలు
(Prejudices) వాటి మరుగున బూర్జువావర్గప్రయోజనాలు
దాగిఉన్నాయి. మానవచరిత్రలో యింతవరకు అధికారం
సంపాదించిన వర్గాలు తమ పెత్తనాన్ని బలపరచుకొనే
టందుకు, తమ దోపిడీపద్ధతుల్ని సమాజమంతటిమీద రుద్ద
డానికి ప్రయత్నించాయి. కాని శ్రామికు లలాకాదు. వారు
తమకుపూర్వం అమల్లోఉన్న దోపిడీపద్ధతుల్ని నిర్మూలిస్తేనే,
తద్వారా పూర్వంనుంచీ అమల్లో ఉన్నవాటినికూడ నాశనం
చేస్తేనే, సామాజిక శక్తులమీద యాజమాన్యం సంపాదించ
గల్గుతారు. వారు తమ సొంతానికి సంపాదించుకొనేది ఏదీ
లేదు. బలపరచుకోవలసింది అసలేలేదు. అదివరలో సొంత
అస్తుల సంపాదనకొరకు వాటి రక్షణకు చేయబడిన ఏర్పా
ట్లన్నిటినీ నాశనంచేయడమే వారి కర్తవ్యం.

ఇంతవరకు సమాజచరిత్రలోబయల్దేరిన ఉద్యమాలన్నీ
అల్పసంఖ్యాకుల ఉద్యమాలు; లేదా వారి ప్రయోజనాలకై
బయల్దేరినవి. కాని శ్రామికులఉద్యమం అలాంటిదికాదు. అది
స్వకీయ చైతన్యంలో (Self-conscious) స్వతంత్రంగా
(Independent) బయల్దేరిన అధికసంఖ్యాకుల ఉద్యమం,

అధికసంఖ్యాకుల ప్రయోజనాలను రక్షించడమే దాని ఆశయం. ఆధునిక సమాజంలో శ్రామికవర్గమే అందరికంటే అట్టడుగువర్గం. దానిమీద అనేక తరగతుల అధికారవర్గాలున్నాయి. వాటన్నిటినీ పైకి పెల్లగించి ఎగరగొట్టకపోతే శ్రామికవర్గం కదలలేదు; పైకిరాలేదు.

మొదటిదశలో శ్రామికవర్గం పెట్టుబడిదారీవర్గంమీద జరిపే పోరాటం, స్వభావంలో కాకపోయినా స్వరూపంలో (Though not in substance, yet in form) మాత్రం జాతీయపోరాటంగానే ఉంటుంది. ఎందుచేతంటే, ఒక్కొక్క దేశంలో శ్రామికవర్గం తనపై ప్రత్యక్షంగా పెత్తనంచేసే జాతీయ పెట్టుబడిదారీవర్గంతో మొదటపోరాడి, అటోయిటో తెల్చుకోవలసియుంటుంది. ఇదిసహజం.

పైన మేము ఏయేదశల్లో శ్రామికవర్గం అభివృద్ధి చెందుతుందో సర్వసాధారణమైన విధంగా (In general) మాత్రమే వివరించాము. ప్రస్తుతసమాజంలో నివురుగప్పిన నిప్పుమాదిరిగాఉండే అంతర్యుద్ధాన్ని గురించి, చివరకదొకమహా విప్లవంగా అంతమవడాన్ని గురించి తెలియజేశాం. పెట్టుబడిదారీవర్గం బలప్రయోగంద్వారా కూల్చివేయబడి, దానిస్థానే శ్రామికవర్గం అధికారంలోకి రావడానికి పునాదులు నిర్మింపబడతాయని స్పష్టంచేశాం.

ఇంతవరకు ప్రతి సమాజస్వరూపం పీడించేవర్గాలకు - పీడింపబడేవర్గాలకు మధ్యవైషమ్యంమీద (Antagonism) ఆధారపడి ఉండేదని తెలుసుకున్నాం, కాని, ఏవర్గమైనా మరొకవర్గాన్ని అణచియుంచాలంటే, ఆ రెండవవర్గం

కనీసం తన బానిసబ్రతుకునైనా నిలబెట్టుకోగలిగి యుండాలి. అస్తిరక్షణ యేర్పాట్లు ఆ సమాజంలో ఉండి తీరాలి. ఉదాహరణకు, అర్ధబానిసల (Serfs) సమాజంలో ఫ్యూడల్ నిరంకుశత్వంక్రింద కృంగికృశించే అర్ధబానిసలు పట్టణాలకుపోయి, పట్టణకమ్యూన్‌లలో సభ్యత్వం సంపాదించి, స్వేచ్ఛగా జీవించగలిగారు. అలాగే మధ్యతరగతికి చెందినవారు (పెటీబూర్జువా) పెట్టుబడిదారీ వర్గంగా అభివృద్ధిచెందారు. కాని ఆధునిక కార్మికవర్గం పరిశ్రమల అభివృద్ధితో బాటు అభివృద్ధి చెందడమనేది లేదు; అంతకంతకు హీనస్థితికి దిగజారవలసివస్తుంది; కార్మికులు కార్మికులుగా బ్రతకడమే నేడు దుర్లభమవుతోంది. అంతకంతకు వారు బిచ్చగాళ్ళుగా మారుతున్నారు. ఈభిక్షుకజీవనమే ప్రపంచజనాభాకంటే ప్రపంచసంపదకంటే ఎక్కువ వేగంగా పెరుగుతోంది; అందుచేత మనకు స్పష్టంగా కనబడుతూన్న విషయమేమంటే, పెట్టుబడిదారీవర్గం సమాజంలో ఒకపాలకవర్గంగా పెత్తనంచేసే అర్హతను కోల్పోయింది. సమాజమంతటిమీద తన జీవిత పద్ధతుల్ని (conditions of existence) రుద్ది అవే పరమోత్కృష్టమైన శాస్త్రీయ సిద్ధాంతాలని చెప్పుకునే రోజులు గతించాయి. ఈ రోజున పెట్టుబడిదారీవర్గానికి సమాజాన్ని పరిపాలించగలశక్తి ఎందువల్ల లేదంటే, తనబానిసల్నే తాను పోషించలేని స్థితిలోపడింది. పెట్టుబడిదారీ వర్గంయొక్క పెత్తనంక్రింద సమాజమిక జీవింపజాలదు. మరోవిధంగా చెప్పాలంటే, పెట్టుబడిదారీవర్గం ఇక జీవించియుండడమంటే అర్థం సమాజమే నాశనం కావడమన్న మాట.

పెట్టుబడిదారీవర్గం తన అధికారాన్ని సుస్థిరంగా నిలుపుకోవాలంటే, ఎప్పటికప్పుడు కొత్త పెట్టుబడి పెంపొందుతూ ఉండాలి. పెట్టుబడి పెంపొందాలంటే, కూలికిపనిచేసే కార్మికులు ఎక్కువగా ఉండాలి. కాని కార్మికులస్థితిగతులు వారిలో వారికుండే పోటీమీద పూర్తిగా ఆధారపడిఉంటాయి. పెట్టుబడిదారీవర్గం ఉద్దేశ పూర్వకంగా కాకపోయినా పరిశ్రమలను విరివిగా అభివృద్ధి చేయడం మూలంగా కార్మికుల్లో పోటీని, తద్వారా అనైక్యతను పోగొడుతూంది. వాటిస్థానే కార్మికులమధ్య పరస్పర సంబంధాలను నెలకొల్పడంద్వారా విప్లవకరమైన ఐక్యతను చేకూరుస్తూంది. ఈ విధంగా, ఆధునిక పరిశ్రమల అభివృద్ధిద్వారా, పెట్టుబడిదారీవర్గం ఏ పునాదులమీద వస్తూత్పత్తిచేసి లాభాలు సంపాదించుకొంటూందో ఆ పునాదుల్నే కూల్చివేయడం జరుగుతూంది. అందుచేత పెట్టుబడిదారీవర్గం తనకు గోరీకట్టే మరో వర్గాన్ని సృష్టించుకొంది. పెట్టుబడిదారీవర్గం నాశనంకావడం, శ్రామిక వర్గం జయించడం రెండూ తప్పదు.



# కమ్యూనిస్టులకు మొత్తం శ్రామికవర్గం యెడల ఎట్టి సంబంధాన్ని కలిగియున్నారు?

కమ్యూనిస్టులితర కార్మిక పార్టీలకు పోటీగా మరో ప్రత్యేకమైన పార్టీని నిర్మించరు.

మొత్తం శ్రామికవర్గంయొక్క ప్రయోజనాలకు భిన్నమైన ప్రయోజనాలు వారికి లేవు. వారు కొన్ని సంకుచితమైన పాక్షిక సిద్ధాంతాలను (Sectarian principles) సృష్టించి వాటిద్వారా కార్మికోద్యమాన్ని పోతపోసినట్లు నిర్మించరు.

కమ్యూనిస్టులకూ, ఇతర కార్మికపార్టీలకూ రెండువిషయాల్లో భేదముంది: (1) వివిధ దేశాల్లో శ్రామికులు జరిపే జాతీయ పోరాటాల్లో మొత్తం శ్రామికవర్గమంతటియొక్క — వారు ఏ జాతికి చెందినప్పటికీ — ప్రయోజనాలను (Interests) ముందు పెడతారు. (2) శ్రామికవర్గం పెట్టుబడిదారీవర్గంమీాద జరిపే పోరాటం అనేకదశల్లో కొనసాగవలసి యుంటుంది. ఈ అన్ని దశల్లో కమ్యూనిస్టులు నిరంతరం అన్నిచోట్ల ఉద్యమమంతటి శ్రేయస్సునూ దృష్టిలో ఉంచుకొని పోరాటం నడుపుతారు.

అందుచేత కార్యరంగంలో కమ్యూనిస్టులు అన్ని దేశాల కార్మికపార్టీలలోనూ యితరులందరికంటే చైతన్యవంతులుగాను, దృఢసంకల్పులుగాను పనిచేస్తారు. ఇతరుల్ని

కార్యరంగంలోకి తీసుకొచ్చేవాళ్ళుగా ఉంటారు. సిద్ధాంత రంగంలోకూడా, వారే యితర శ్రామికులకంటె చక్కగా ఆలోచించేవారు. ఏ మార్గంలో కార్మికోద్యమం ప్రయోగమించాలో, విజయసాధన కేమేమి అవసరమో, ఆ విజయాలవల్ల తుదకెట్టి సాధారణ ఫలితాలు (General results) కలుగుతాయో వారికే స్పష్టంగా తెలుసుకోగలిగి ఉంటారు.

కమ్యూనిస్టుల తక్షణ గమ్యస్థానం (Immediate aim) ఇతరపార్టీల తక్షణ గమ్యస్థానం ఒక్కటే. అది శ్రామికులందరినీ ఒకే ఒక వర్గంగా సంఘటితపరచడం, పెట్టుబడిదార్ల పెత్తనాన్ని కూలద్రోయడం, శ్రామికవర్గమే రాజకీయాధికారాన్ని స్వాధీనం చేసుకోవడం.

కమ్యూనిస్టుల సిద్ధాంత నిర్ణయాలు లోకాన్ని మరమ్మతు చేయగోరే భవిష్యత్సంఘసంస్కర్తల (Would-be universal reformers) అభిప్రాయాలపైగాని, వారి సిద్ధాంతాలపైగాని ఆధారపడి ఉండవు.

ఒక వాస్తవికమైన వర్గపోరాటంలో, ప్రత్యక్షంగా మనందరి కండ్లముందు కనబడే చారిత్రకగమనంలో, కొన్ని నిర్దిష్టమైన వర్గసంబంధాలు బయల్దేరుతాయి. వాటినిగూర్చి సాధారణమైన మాటల్లో (In general terms) తెలియజేసే సూత్రాలే కమ్యూనిస్టు సిద్ధాంతాలు. ఆస్తిసంబంధాల నిర్మూలన కమ్యూనిజంయొక్క ప్రత్యేక లక్షణ మేమీకాదు. ఇంతవరకు చారిత్రక పరిస్థితుల మార్పుతో బాటు ఆస్తిసంబంధాలుకూడ నిరంతరం మారుతూనే వచ్చాయి.

ఉదాహరణకు ఫ్రెంచివిప్లవం ఫ్యూడల్ ఆస్తిని నాశనం చేసి దానిస్థానే బూర్జువా (పెట్టుబడిదారీ) ఆస్తిని ప్రవేశపెట్టింది.

కమ్యూనిజంయొక్క ప్రత్యేకత మొత్తం ఆస్తిని నిర్మూలించడం కాదు. బూర్జువా ఆస్తిని నిర్మూలించడమే దాని ప్రత్యేకత. అయితే వర్గవైషమ్యాలపైన (Class antagonisms) అల్పసంఖ్యాకులు అధికసంఖ్యాకులపై చేసే దోపిడీపైన ఆధారపడ్డ వస్తూత్పత్తి వస్తు సంగ్రహణావిధానం ఈ రోజున చరమదశకు వచ్చింది. దాని చిట్టచివరి (System of Producing & appropriating Products) సమగ్రరూపమే నేటి బూర్జువా సొంత ఆస్తివిధానం.

ఈ దృష్టితో చూచినట్లయితే, కమ్యూనిస్టుల సిద్ధాంతాన్ని ఒకే మాటలో చెప్పవచ్చు: సొంత ఆస్తి నిర్మూలనం.

కమ్యూనిస్టులమైన మేము, సొంతంగా పనిచేసుకొనే వ్యక్తులకు ఆస్తి సంపాదించే హక్కు లేకుండా చేస్తామని, అలాంటి సొంతఆస్తివ్యక్తుల స్వాతంత్ర్యానికీ, కార్యకలాపాలకూ మూలం అని, కొందరు విమర్శిస్తున్నారు.

వ్యక్తులు సొంతంగా పనిచేసి సంపాదించుకునే ఆస్తి విషయమేనా మీరు ప్రస్తావించేది? బూర్జువా ఆస్తివిధానం ప్రవేశించక పూర్వం చిన్నరైతులు, చేతిపరిశ్రమల్లో ఆధారపడేవారు, సంపాదించుకునే ఆస్తి విషయమేనా మీరు మాట్లాడేది? అయితే వినండి. అలాంటి ఆస్తిని నిర్మూలించవలసిన అవసరమేమీ మాకు లేదు. కారణం యేమంటే? పరిశ్రమల అభివృద్ధివల్ల అట్టిఆస్తి యిదివరకే చాలావరకు నిర్మూలింపబడింది. ఇప్పటికీ ప్రతిరోజు నిర్మూలింపబడుతోంది.

లేక మీరు మాట్లాడుతూన్నది ఆధునిక బూర్జువా ఆస్తి విషయమా ?

అలాఅయితే చేతి కార్మికునికి కూలిపనివల్ల (Wage-Labour) లభించే ఆస్తి కొంచెమైనా ఉంటుందా ? ఉండదు. కూలిపని పెట్టుబడిని సృష్టిస్తోంది? అంటే కార్మికుల్ని దోచుకో వడానికుపయోగపడే ఆస్తిని సృష్టిస్తోంది. ఇదేవిధంగా ఈ పెట్టుబడి యొక్క దోపిడీకి గురిచేయబడే కార్మికవర్గాన్ని సృష్టిస్తూ ఉండాలి. లేకపోతే అది వృద్ధి చెందదు. ఆస్తియొక్క ప్రస్తుత స్వరూపం, పెట్టుబడిదారులకూ - కార్మికులకూ మధ్య గల వైషమ్యంమీద ఆధారపడిఉంది. ఈ వైషమ్యం రెండు విధాలుగాఉంది. అవి ఏవో చూదాం.

ఒకవ్యక్తి పెట్టుబడిదారుగా ఉండాలంటే, ఉత్పత్తివిధానంలో అతనికొక వ్యక్తిగతహోదామాత్రమేగాక, నిర్దిష్టమైన సాంఘికహోదాకూడా ఉండాలి. పెట్టుబడి సమిష్టిశ్రమయొక్క ఫలితం. అనేకమంది వ్యక్తులు కలిసి సమిష్టిగా పనిచేస్తేగాని, అది లభించదు. అంతేకాదు, సమాజంలోనివారంతా కలసి పనిచేసినప్పుడే, పెట్టుబడికి చలనరూపం వస్తుంది. (Set in Motion)

అందుచేత, పెట్టుబడి ఒక సామాజికశక్తి (Social Power). వ్యక్తిగత కృషిఫలితం కాదు.

కాబట్టి పెట్టుబడిని సమాజంలోని ప్రజలందరి సమిష్టి ఆస్తిగా మార్చినంతమాత్రాన వ్యక్తుల సొంతఆస్తిలో మార్పు కలుగదు. అది సామాజిక ఆస్తిగా (Social Property)

ఎన్నటికీ మార్పుచెందదు. మారేదల్లా ఆస్తియొక్క సామాజిక స్వభావంమాత్రమే (Social Character). తన వర్గస్వభావాన్ని మాత్రమే అది పోగొట్టుకుంటుంది.

ఇప్పుడు కూలి పనివిషయం (Wage - Labour) చూదాం. కార్మికుని కిచ్చే కనీసజీతమే కూలిపనియొక్క సగటుఖరీదు. అంటే కార్మికుడు జీవించియుండటాని కవసరమైన వస్తువులఖరీదు. అతడు తన శ్రమద్వారా సంపాదించుకొనే జీతం తన జీవితాన్ని పొడిగించుకోడానికి, తన వంశాన్ని వృద్ధిచేసుకోటానికీ మాత్రమే సరిపోతుంది. ఈ విధంగా మానవ జీవితాన్ని పొడిగించటానికీ, మానవజాతిని వృద్ధిచేయటానికీ, మాత్రమే ఉపయోగపడుతూ కొంచెమైనా అదనముగా మిగుల్చుకోటాని కవకాశమీయని వ్యక్తిగత సంపాదనను నిర్మూలించడం మా ఉద్దేశంగాదు. మేము నిర్మూలించదలచిందల్లా యీ సంపాదన పద్ధతియొక్క దౌర్భాగ్య స్వభావాన్ని మాత్రమే. ప్రస్తుత విధానంలో కార్మికుడు పెట్టుబడిని వృద్ధి చేయడానికే జీవిస్తున్నాడు. అలా జీవించడమైనా పాలక వర్గానికి అవసర మున్నప్పుడే.

పెట్టుబడిదారీ సమాజంలో సజీవమైన మానవశ్రమ (Living Labour) నిర్జీవమైన శ్రమమొత్తాన్ని (Accumulated Labour) అనగా పెట్టుబడిని వృద్ధిచేయడాని కొక సాధనంగా ఉపయోగపడుతోంది. కాని కమ్యూనిస్టు సమాజంలో నిర్జీవమైన శ్రమ మొత్తం కార్మిక జీవితాన్ని విస్తృత పరిచేటందుకు, వికసింపచేసేటందుకు, పెంపొందించేటందుకు సాధనంగా ఉపయోగపడుతుంది.

ఈ విధంగా, పెట్టుబడిదారీ సమాజంలో జరిగిపోయిన కాలం, జరుగుతూన్న కాలంమీద అధికారం చేస్తుంది (The past dominates the present). కమ్యూనిస్టు సమాజంలో అలా కాకుండా జరుగుతూన్న కాలమే, జరిగిపోయిన కాలంమీద అధికారం చేస్తుంది. పెట్టుబడిదారీ సమాజంలో సర్జీవమైన పెట్టుబడికి సంపూర్ణ స్వేచ్ఛ, సంపూర్ణ వ్యక్తిత్వం, (Individuality) ఉన్నాయి. సజీవమైన మానవులుమాత్రం పరాధీనులుగా, వ్యక్తిత్వం లేనివారుగా ఉన్నారు.

ఈ పరిస్థితిని నిర్మూలించడమంటే అర్థం స్వాతంత్ర్యాన్ని, వ్యక్తిత్వాన్నీ నాశనం చేయడమేనని పెట్టుబడిదారులు ఆక్షేపిస్తున్నారు. ఒక విధంగా వారు చెప్పేది నిజమే. బూర్జువా స్వాతంత్ర్యాన్నీ, బూర్జువా వ్యక్తిత్వాన్నీ మేము సమూలంగా నిర్మూలన చేయాలంటాం.

నేటి పెట్టుబడిదారీ సమాజంలో స్వేచ్ఛ అంటే అర్థం స్వేచ్ఛా వ్యాపారం, స్వేచ్ఛాయుతమైన క్రయ విక్రయాలు.

కాని క్రయ విక్రయాలే లేనప్పుడు స్వేచ్ఛాయుతమైన క్రయ విక్రయాలుకూడా మాయమై తీరుతాయి. స్వేచ్ఛా వ్యాపారమనీ, సమస్త విషయాల్లోను స్వాతంత్ర్యమనీ పెట్టుబడిదారులు చేసే గోలకు, వారి "గంభీరవాక్కుల"కు ప్రస్తుత పరిస్థితుల్లో అర్థం ఏమీ లేదు. మధ్యయుగాలలో వర్తకుల క్రయ విక్రయాలమీద అనేక నిబంధనలుండేవి. అందుచేత ఆ రోజుల్లో యీ మాటలకు అర్థంవుండేది. కాని నేడు అసలు క్రయ విక్రయాలనే (సొంత లాభాలకోసం చేసేవి) రద్దు చేయాలని కమ్యూనిస్టులు కోరుతున్నారు. పెట్టుబడిదారీ

పుత్పత్తి విధానాన్నే నాశనం చేయాలంటున్నారు. బూర్జువా వర్గాన్నే నిర్మూలించాలంటున్నారు. ఇట్టి పరిస్థితుల్లో పై మాటలకు అర్థమేమీ లేదు.

మేము సొంత ఆస్తిని రద్దు చేయాలంటూన్నప్పుడు భయంతో మీరు హడలెత్తుతున్నారు. కాని, నేటి సమాజంలో పదింట తొమ్మిదివంతులమందికి సొంత ఆస్తి ఇదివరకే రద్దుచేయబడింది. మిగతా కొద్దిమందికి సొంతఆస్తి ఉందంటే దానికి కారణం తక్కినవారి కది లేకపోవటమే. ఈ పాడుపరిస్థితిని నిర్మూలించపూనుకున్న మామీద మీరు విరుచుకుపడుతున్నా రన్నమాట.

దీన్నే క్లుప్తంగా చెప్పాలంటే, మీరు మమ్మల్ని ఖండిస్తూన్నది, మీ ఆస్థిని మేము రద్దుచేయబూనుకున్నందుకు. ముమ్మాటికి ఇది నిజమే. మా ఉద్దేశం సరిగ్గా యిదే.

మానవుని శ్రమను పెట్టుబడిగాగానీ, ధనంగాగానీ, శిస్తుగా (Rent)గానీ మార్చుకునే అవకాశం ఏ క్షణంలో పోతుందో, ఏ క్షణంలో గుత్తాధికారులు స్వాధీనంచేసుకోగల సామాజిక శక్తిగా (Social Force) దాన్ని మార్చటం అసాధ్య మవుతుందో, అంటే ఏ క్షణంలో వ్యక్తిగత ఆస్తిని బూర్జువా ఆస్తిగా మార్చటం దుర్లభమవుతుందో ఆ క్షణం నుంచీ మానవుని వ్యక్తిత్వం నశిస్తుందని మీ వాదన.

కాబట్టి "వ్యక్తి" అంటే పెట్టుబడిదారీవర్గమని మీ అర్థం. ఈ విషయాన్ని మీ రంగీకరించి తీరాలి. అట్టి "వ్యక్తుల్ని" మార్గమధ్యంనుంచి తప్పకుండా తొలగించాలి. మానవ సమాజంలో వారు ఉండకూడదు.

సామాజిక వస్తుసంపదను (Products of Society) అనుభవించే హక్కు ప్రతివ్యక్తికీ వుండాలి. అట్టి హక్కును కమ్యూనిజం తొలగించదు. అయితే, అలా అనుభవించటం కోసం యితరుల శ్రమను దోచుకోవటాన్ని మాత్రం అది నిషేధిస్తుంది.

మరొక విమర్శన ఏమంటే, సొంతఆస్తి నిర్మూలింపబడితే ఎవరూ పనిచేయరు. అందరూ సోమరిపోతులుగా తయారవుతారు.

ఇలా విమర్శించేవారివాదన ప్రకారం పెట్టుబడిదారీ సమాజం, సోమరితనంవల్ల చాలాకాలంక్రిందటే నాశనమై యుండాలి. కారణం ఏమంటే నేటి సమాజంలో కష్టపడిపనిచేసే వారెవరూ ఆస్తులు సంపాదించుకోలేకున్నారు. రెండవవైపు ఆస్తులు సంపాదించేవారెవరూ కష్టపడి పనిచేసేవారుకారు. ఈ విమర్శన అర్థం పెట్టుబడినే రద్దుచేసేసమాజంలో కూలికి పనిచేసేవారుకూడా ఉండరనేవాదనను మరోవిధంగా చెప్పటం తప్ప మరొకటికాదు.

వస్తువులను ఉత్పత్తిచేసే విషయంలోనూ, వాటిని సంపాదించుకునే విషయంలోనూ, కమ్యూనిస్టులు చేసే సూచనలను ఖండిస్తూ ఏ ఆక్షేపణలైతే చేయబడుతున్నాయో, అవన్నీ మేధాసంపత్తి (Intellectual products) విషయంలో కూడా చేయబడుతున్నాయి. వర్గసంబంధమైన ఆస్తిని (Class property) నాశనంచేయటమంటే మొత్తం ఉత్పత్తినే నాశనం చేయటమని పెట్టుబడిదారులు ఎలా అర్థం చెపుతున్నారో, అలాగ వర్గసంబంధమైన సంస్కృతిని (Class Culture)

నిర్మూలించటమంటే మొత్తం సంస్కృతినే నిర్మూలించటమని వ్యాఖ్యానం చేస్తున్నారు.

ఏ సంస్కృతిని నాశనంచేస్తే సర్వమూ నాశనమవుతుందని పెట్టుబడిదారులు విలపిస్తున్నారో, ఆ సంస్కృతి అత్యధిక సంఖ్యాకులైన ప్రజల్ని యంత్రాలమాదిరిగా తయారు చేస్తుంది.

స్వేచ్ఛ, సంస్కృతి, న్యాయం మొదలయినవాటిపై మీకుగల సొంత అభిప్రాయాలను ఒక కొలతబద్దగా పెట్టుకుని, దానితో బూర్జువా ఆస్తిని రద్దు చేయదలచుకున్న మా అభిప్రాయాలనుమాత్రం కొలవకండి. కాని, అలా కొలవతలచుకుంటేమాత్రం మమ్మల్ని మీరు ఆక్షేపించకండి. అసలు మీ అభిప్రాయాలు మీ పెట్టుబడిదారీ విధానంలో, మీ ఆస్తి సంబంధాలలో ఉద్భవించినవే. మీ న్యాయశాస్త్రం మీ వర్గప్రయోజనాల రక్షణకై తయారుచేయబడినదే. అయినా, ప్రజలందరిమీద అది రుద్దబడింది. మీ వర్గంయొక్క ఆర్థిక పరిస్థితులపైనే మీ న్యాయశాస్త్రపు స్వభావం, గమనం కూడా ఆధారపడి వుంటాయి.

మీ ఉత్పత్తివిధానం మీ ఆస్తిస్వరూపాల ఫలితంగా ఏర్పడ్డ సామాజిక సంబంధాలను శాశ్వతమైన ప్రకృతి నియమాలుగాను, హేతువాద సిద్ధాంతాలుగాను (**Laws of nature and reason**) మీరు చిత్రిస్తున్నారు. స్వార్థ బుద్ధితో కూడిన దురభిప్రాయంవల్లనే మీ రలా ఊహించుకుంటున్నారు. కాని, వాస్తవవిషయమేమంటే అవేవీ శాశ్వతమైనవి కావు. సమాజంలో ఉత్పత్తి అభివృద్ధి చెందేకొద్దీ

కొత్తచారిత్రక సంబంధాలు ఉద్భవించటం, పాతవి సమసి పోవడం జరుగుతూ ఉంటుంది. మీ దురభిప్రాయమే మీ పూర్వీకులైన పాలకవర్గాలకుకూడా ఉండేది. దీన్ని మీరు ప్రాచీన ఆస్తి సంబంధాలలో (బానిసయుగం - అను) స్పష్టం గానే చూచారు. ఫ్యూడల్ ఆస్తి సంబంధాలలో దీన్ని మీరంగీకరించారు కూడా. కాని, మీ సొంతవిషయం వచ్చే సరికి యీ వాస్తవాన్ని మీ రంగీకరించలేకున్నారు.

మేము కుటుంబాన్ని నాశనంచేయ బూనుకున్నామని మరో ఆరోపణ. ఇంత నీచాతినీచమైన సూచన చేస్తున్నా మని మామీద అతివాదుల్లో అతివాదులైనవారు కూడా ఉగ్రులవుతున్నారు.

అసలు పెట్టుబడిదారీ కుటుంబంయొక్క మూలాధారం ఏమిటి? పెట్టుబడి; ధనార్జన. అయితే, ఇలాంటి కుటుంబాలు పెట్టుబడిదారీవర్గంలో మాత్రమే సమగ్రరూపంలో ఉన్నాయి. శ్రామికుల్లో కుటుంబసంబంధాలే ఇంచుమించు నశించాయని చెప్పవచ్చు. ఇక వ్యభిచారం, బహిరంగంగానూ, విశృంఖ లంగానూ పెట్టుబడిదారీ సమాజంలో వ్యాప్తి జెందింది.

వ్యభిచారాన్నీ, శ్రామికుల కుటుంబరహిత జీవితాన్నీ నిర్మూలిస్తే, పెట్టుబడిదారీకుటుంబం దానంతటదే మాయమవు తుంది. పెట్టుబడిదారీ విధానాన్ని నాశనంచేసిననాడు, పెట్టు బడిదారీ కుటుంబమూ వుండదు, శ్రామికుల కుటుంబరహిత జీవితమూ వుండదు. వ్యభిచారమూ వుండదు.

తలిదండ్రులు తమ బిడ్డల్ని జీతపు డబ్బులు సంపాదించే పనిముట్లుగా ఉపయోగించుకుంటున్నారు. ఈ దోపిడీని అరికట్ట

దలచుకున్న మమ్మల్ని మీరు నేరస్థులుగా ఎంచుతున్నారు. నిజమే. ఈ నేరాన్ని మే మంగీకరిస్తున్నాం.

కాని, మీరు మాపై మరో ఆరోపణ చేస్తున్నారు. మేము గృహవిద్యకు బదులు సామాజిక విద్యను ప్రవేశపెట్టాలంటున్నాం. కాని ఇలాచేస్తే, పవిత్రమైన కుటుంబసంబంధాలు మట్టిపాలవుతాయంటూ మీరు చిందులు త్రొక్కుతున్నారు.

అసలు మీరు మీబిడ్డలకు నేర్పే విద్య ఎలాంటిది? అదిమాత్రం సామాజిక విద్యకాదా? ప్రత్యక్షంగాగానీ, పరోక్షంగాగానీ స్కూళ్ళు-కాలేజీలద్వారా సమాజం మీబిడ్డల చదువులో జోక్యం తీసుకోవటంలేదా? అట్టివిద్య సామాజిక విద్యగాక మరేమిటి? ఈ జోక్యం కమ్యూనిస్టులు సృష్టించింది గాదే! అయితే మేము దాని స్వభావాన్ని మాత్రం తప్పక మార్చ ప్రయత్నిస్తాం. బాలబాలికల విద్యను పాలకవర్గ ప్రభావంనుండి తప్పించటానికి కృషిచేస్తాం.

పారిశ్రామికాభివృద్ధివల్ల శ్రామికుల కుటుంబ సంబంధాలు ఛిన్నాభిన్నమయాయి. వారి బిడ్డలు కేవలం వర్తకపు సరుకులుగా, కష్టపడి పనిచేసే శ్రమసాధనాలుగా - (Instruments of Labour) ఉపయోగపడుతున్నారు. దీన్ని మనం దృష్టిలో ఉంచుకుంటే కుటుంబాన్ని గురించీ, కుటుంబ సంబంధాల పవిత్రతను గురించీ, పిల్లల చదువును గురించీ పెట్టుబడిదారులు చెప్పే డాంబికపు కబుర్లు యింకా రోత పుట్టిస్తాయి. మేము స్త్రీలను సమాజంయొక్క సమిష్టిసొత్తుగా మార్చివేస్తామంటూ పెట్టుబడిదారులంతా ఒక్క గొంతుకతో అరుస్తున్నారు.

పెట్టుబడిదారు తన భార్యను ఒక ఉత్పత్తిసాధనంగా ఉపయోగించుకుంటాడు. ఉత్పత్తిసాధనాలన్నీ సంఘపరం చేయబడి, సంఘంచేత నడపబడతాయని అతడు వింటాడు. వెంటనే సహజంగా స్త్రీలనుకూడా సమాజపరం చేస్తారుగదా అని భావిస్తాడు.

స్త్రీని కేవలం ఉత్పత్తిసాధనంగా ఉపయోగించుకొనే విధానాన్ని రూపుమాపడమే కమ్యూనిస్టుల ఉద్దేశమని అతనికి నిస్సందేహంగా తెలుసు. కమ్యూనిస్టులు బహిరంగంగా అధికారబలంతో స్త్రీలందరినీ సంఘపరం చేస్తారంటూ పెట్టుబడిదారులు చేసే యీ విష్రపచారం, యీ కృత్రిమ ఆవేశం హాస్యాస్పదంగా కనబడకమానదు. ఎందుచేతంటే స్త్రీలను సంఘంయొక్క సమిష్టిసొత్తుగా చేయటానికి కమ్యూనిస్టులు రానక్కర్లేదు. యుగయుగాలనుంచీ అది అమల్లోనేవుంది. దాన్ని నిర్మూలించ పూనుకుంటారు కమ్యూనిస్టులు.

పెట్టుబడిదారులు తమ ఆధీనంలో వున్న శ్రామికుల భార్యల్నీ, కుమార్తెల్నీ బలాత్కరించి సౌఖ్యం అనుభవిస్తున్నారు. అంతటితో సంతృప్తిచెందక, పడుపువృత్తిచేసే వేశ్యలుకూడా వారికి కావలసివచ్చారు; కాని వారూ చాలడంలేదు; ఒండొరుల భార్యల్ని అనుభవించటంలోకూడా వారు అమిత సౌఖ్యం పొందుతున్నారు.

నిజం చెప్పాలంటే బూర్జువా వివాహపద్ధతి ఏకపత్నీవ్రతంచాటున జరిగే విశృంఖల ప్రవర్తనతప్ప మరొకటికాదు. అందుచేత మీరొకవేళ కమ్యూనిస్టుల్ని ఆక్షేపించదలచుకుంటే రహస్యంగా మీరుజరిపే యీ కపటనాటకాన్ని కమ్యూనిస్టులు

బహిరంగమైన చట్టసమ్మత చర్యగా చేయదలచుకొన్నారని ఆరోపించండి. కాని అసలువిషయమేమంటే యిప్పుడున్న ఉత్పత్తివిధానం నాశనమైతే, అందులో ఉద్భవించిన విశృంఖల ప్రవర్తనకూడా అంటే రహస్యంగానూ, బహిరంగంగానూ జరిగే వ్యభిచారంకూడా నశిస్తుంది. ఇది స్వయంవ్యక్తమే.

కమ్యూనిస్టులు దేశాల్నీ, జాతుల్నీ రద్దుచేస్తారంటూ మామీద మరో ఆరోపణ.

కార్మికులకు దేశం అనేదంటూ లేదు. అందుచేత మేము దాన్ని లాక్కొనే ప్రశ్న రాదు. కాని ప్రతిదేశంలోనూ శ్రామికవర్గం మొట్టమొదట రాజకీయాధికారాన్ని సంపాదించాలి గనుక, అదే నాయకవర్గంగా పైకిరావలసియుందిగనుక, తానే ప్రతిజాతికి ప్రాతినిధ్యంవహించాలి గనుక నిజమైన జాతీయత శ్రామికవర్గానిదేనని చెప్పాలి. అయితే పెట్టుబడిదారులిందుకు సమ్మతించరు; అది వేరేవిషయం.*

---

* లెనిన్ 1916 నవంబరు 30 వ తేదీని జూరిచ్‌నుంచి ఒక మిత్రునికి ఉత్తరంవ్రాస్తూ యిలా తెలియజేశాడు :

"......ఈ సమస్యను మీరు ఒకేవైపునుంచి అతి సంకుచితమైన దృష్టితో పరిశీలిస్తూన్నట్లు కనబడుతోంది. కమ్యూనిస్టు ప్రణాళికనుంచి మీరొక వాక్యాన్ని తీసుకొని ("కార్మికునకు దేశమనేదంటూ లేదు") దాన్ని 'ముక్కస్యముకాక్షః' అన్ని పరిస్థితులకు ఒకేవిధంగా వర్తింపజేస్తున్నారు. చివరకు జాతీయ సమరాలుకూడా (National wars) పనికిరావనే స్థితికి మీరు వచ్చారంటే ఎంత సంకుచితముగా మీరు ఆ వాక్యాన్ని అర్థంచేసుకున్నారో బోధపడుతుంది."

"మార్క్సిజం బోధించేది ఏమంటే: (a) ప్రతి పరిస్థితిని చారిత్రక దృష్టితో పరిశీలించాలి. (b) దానికీ యితర పరిస్థితులకూ గల సంబంధాన్ని గమనించాలి. (c) చరిత్ర నేర్పే అనుభవాన్ని తెలుసుకోవాలి."

"మాతృదేశం అనే భావం ఒక నిర్దిష్టమైన చారిత్రక దశలో ఉద్భవించింది. ఒక జాతి మరో జాతిని దోచుకొనే పద్ధతికి వ్యతిరేకంగా పోరాటాలు జరిగేదశలో అనగా ప్రస్తుతదశలో, మాతృదేశం అనేమాటకు ఒక నిర్దిష్టమైన అర్థం ఉంటే జాతీయోద్యమాలు పెంపొందియున్న దశలో మరొక అర్థం ఉంటుంది. నేను పేర్కొన్న మూడు రకాలైన దేశాలకూ (1. బాగా అభివృద్ధి చెందిన పశ్చిమ యూరోపియన్ దేశాలు. ఈ దేశాల్లో ఇదివరకే 1789 - 1871 మధ్య బూర్జువా ప్రజాతంత్ర విప్లవాలు పూర్తి అయి సంపూర్ణ స్వాతంత్ర్యంగల జాతీయ ప్రభుత్వాలు ఏర్పాడ్డాయి. 2. బూర్జువా ప్రజాతంత్ర విప్లవాలు ఇంకా పూర్తిగాని తూర్పు యూరోపియన్ దేశాలు. 3. విదేశీ పరిపాలన క్రింద వలసదేశాలుగాను, అర్థవలస దేశాలుగాను ఉండే ఆసియాఖండపు దేశాలు) మాతృదేశ రక్షణ అనే నినాదాన్ని ఒకే విధంగా వర్తింపజేయకూడదు."

"కార్మికులకు దేశం అనేదంటూ లేదని కమ్యూనిస్టు ప్రణాళికలో వుంది."

"నిజమే. కాని, అంతమాత్రమే చెప్పి అది వూరుకోలేదు. జాతీయ ప్రభుత్వాల నిర్మాణం విషయంలో శ్రామికవర్గానికి ప్రత్యేకమైన పాత్ర ఉందనికూడా అది చెప్పింది. మొదటి వాక్యాన్ని మాత్రమే ("కార్మికులకు దేశం అనేదంటూ లేదు.") మీరు ఉదహరించడానికి రెండవ వాక్యానికీ గల సంబంధాన్ని విస్మరిస్తే, పొరపాటు చేసినవారు అవుతారు.

"ఆ సంబంధం ఏలాంటిది? ఏలాంటిదని నా అభిప్రాయమంటే, శ్రామికవర్గం ప్రజాతంత్ర ఉద్యమాలను బలపరచాలి. (ఆయా ప్రత్యేక సమయాలలో ప్రత్యేక పరిస్థితులలో) అందుచేత మాతృదేశరక్షణకు జరిగే పోరాటాలను శ్రామికవర్గం బలపరచితీరాలి; వ్యతిరేకించకూడదు.

"కార్మికులకు దేశం అనేదంటూ లేదని కమ్యూనిస్టు ప్రణాళికలో మార్క్సు, ఎంగెల్సు చెప్పారు. కాని వీరిద్దరూ అనేకసార్లు జాతీయ సమరములో పాల్గొనవలసిందని కూడా ప్రజలకు విజ్ఞప్తిచేశారు. 1848 లో మార్క్సు, 1859 లో ఎంగెల్సు అట్టి పిలుపు ఇవ్వడం జరిగింది. (జర్మన్ ప్రజల జాతీయవాంఛను బలపరుస్తూ Pox and Rhine అను కరపత్రం ద్వారా జాతీయ సమరం సాగించవలసిందని విజ్ఞప్తి చేయబడింది.)

రోజురోజుకూ పెట్టుబడిదారీవర్గం అభివృద్ధిచెందేకొద్దీ, స్వేచ్ఛావ్యాపారం విస్తరించేకొద్దీ, ప్రపంచ మార్కెట్టు బలపడేకొద్దీ ఉత్పత్తి విధానంలోనూ, తద్వారా ప్రజల జీవిత పద్ధతుల్లోనూ ఏకత్వం (Uniformity) వస్తుంది. తత్ఫలితంగా జాతులమధ్య విభేదాలు అంతరిస్తాయి. వివిధ దేశాల ప్రజలమధ్య వైరుధ్యాలు మాయమవుతాయి. ఇది నేడు మన కండ్లయెదుట నిత్యమూ జరుగుతోంది.

---

ఫ్రాన్సు రష్యాల ప్రభుత్వాలు జర్మనీపై యుద్ధం ప్రకటించడానికి సిద్ధమవుతూన్నప్పుడు 1891 లో ఎంగెల్సు మాతృదేశరక్షణకు పిలుపు ఇచ్చాడు."

"వెన్నిజెట్టి మార్క్సు, ఎంగెల్సులు ఒకరోజున ఒకమాట, మరునాడు ఇంకొకమాట చెప్పారని అర్థమా? కానేకాదు. నా ఖచ్చితమైన అభిప్రాయం ఏమంటే మాతృదేశరక్షణకు జాతీయ సమరంలో పాల్గొనడం మార్క్సిజానికి వ్యతిరేకంకాదు; దానికనుగుణ్యమైన విధానం అది. 1891 లో జర్మన్ సోషల్ డెమాక్రాట్లు ఫ్రెంచి ప్రభుత్వాన్ని, రష్యన్ ప్రభుత్వాన్ని ప్రతిఘటిస్తూ తమ మాతృదేశరక్షణకు పూనుకొనియుండవలసింది..."

మొదటి ప్రపంచయుద్ధంలో (1914-1918) వివిధదేశాల పాలకవర్గాలు "మాతృదేశరక్షణ" అనేపేరుతో కార్మికవర్గాన్ని మోసంచేయ పూనుకున్నప్పుడు లెనిన్ ఆ నినాదంయొక్క బూటకత్వాన్ని బయటపెట్టాడు. సామ్రాజ్యవాదులు ప్రపంచాన్ని పంచుకునేందుకు ప్రారంభించిన ఆ యుద్ధంలో ఏదేశ కార్మికులూ పాల్గొనరాదనీ, సామ్రాజ్యవాద యుద్ధాన్ని అంతర్యుద్ధంగా మార్చి, ఏ దేశంలోని కార్మికులు ఆ దేశంలో అధికారాన్ని హస్తగతం చేసుకోవాలనీ, ప్రబోధించాడు. రష్యాలో కార్మికవర్గం బోల్షివిక్కుల నాయకత్వాన యీ నినాదాన్ని అమలు జరిపింది.

—అనువాదకుడు.

శ్రామికవర్గం అధికారానికి వస్తే, యీ విభేదాలింకా త్వరగా మాయమవుతాయి. శ్రామికవర్గం విముక్తి చెందాలంటే, ప్రధానంగా జరగవలసిన పనుల్లో ఒకటి, కనీసం అగ్రస్థానంలోవున్న నాగరిక దేశాలు సమిష్టి కార్యాచరణకు పూనుకోవడం.

ఒకవ్యక్తి మరోవ్యక్తిని దోచుకొనేపద్ధతి యెంత యెక్కువస్థాయిలో నిర్మూలింపబడుతుందో, అంత యెక్కువస్థాయిలో ఒకజాతిని మరోజాతి దోచుకొనేపద్ధతికూడా నిర్మూలింపబడుతుంది. ఒక్కొక్క దేశంలో వివిధ వర్గాల మధ్య వైరుధ్యాలెంత సమగ్రంగా రద్దుచేయబడతాయో, అంత సమగ్రంగా వివిధ దేశాలమధ్యగల శత్రుత్వం మాయమవుతుంది.

ఇక, కమ్యూనిస్టుల్ని గురించి కొందరు మత దృష్ట్యా, తాత్వికదృష్ట్యా, మొత్తం మీద సిద్ధాంతదృష్ట్యా చేసే విమర్శనలను మనమంతలోతుగా పరిశీలించ నవసరములేదు.

మానవుని భౌతిక పరిస్థితులు, సాంఘిక జీవితం, సామాజిక సంబంధాలు మారేకొద్దీ, అతని ఊహాలు, భావాలు, అభిప్రాయాలూకూడా ఒక్కమాటలో చెప్పాలంటే అతని చైతన్యం (Consciousness) కూడా, సహజంగా మారుతుంది. ఈ వాస్తవాన్ని అర్థంచేసుకొనేందుకు స్వతసిద్ధమైన ప్రజ్ఞా విశేషమేమీ అవసరంలేదు.

భౌతికవస్తువుల ఉత్పత్తి విధానం మారేకొద్దీ, మానవుని విజ్ఞానంలోకూడా మార్పు వస్తుందనే విషయం మానసిక భావాల చరిత్రవల్ల స్పష్టంగా తెలుసుకోవచ్చు. ప్రతి చారి

త్రక దశలోనూ, ప్రజల్లో గాఢంగా నాటుకుపోయిన భావా లన్నీ (Ruling ideas) పాలకవర్గంయొక్క భావాలే.

భావాలు సమాజంలో విప్లవాలు తీసుకువస్తాయని కొందరు చెప్పేటప్పుడు ఆ మాటల్లో ఒక వాస్తవ విషయం వ్యక్తమవుతుంది. అది యేమంటే పాత సమాజంలోనే కొత్త సమాజపు బీజాలు ఉద్భవిస్తాయి. పాత సామాజిక పరిస్థితులు ఎంత వేగంగా నమసిపోతాయో అంత వేగంగా పాతభావాలు నశిస్తాయి.

ప్రాచీన సమాజం (బానిస సమాజం – అను) ఆఖరు దశలో ఉన్నప్పుడు క్రైస్తవ మతం ప్రవేశించి, ప్రాచీన భావాలన్నింటినీ నిర్మూలించింది. కాని, 18వ శతాబ్దం వచ్చే సరికి, ఈ క్రైస్తవభావాలు హేతువాద భావాల ముందు (Rationalistic ideas) లొంగిపోయినప్పుడు, ఫ్యూడల్ సమాజం ఆనాటి విప్లవవర్గమైన పెట్టుబడిదారీ వర్గంతో తుది పోరాటం జరిపి, నశించిపోయింది. మత స్వాతంత్ర్యాన్ని గురించీ, భావస్వాతంత్ర్యాన్ని గురించీ, బయల్దేరిన క్రొత్త అభిప్రాయాలు, స్వేచ్ఛా వ్యాపార పద్ధతియొక్క మానసిక ప్రతిబింబాలు.

ఈ విషయమై కొందరు క్రిందివిధంగా వాదించవచ్చు. "చారిత్రక పరిణామంలో మతవిశ్వాసాలు, నైతికసూత్రాలు, తాత్వికసిద్ధాంతాలు, న్యాయశాస్త్ర నిబంధనలూ మారుతూ వచ్చినమాట నిజమే. కాని మతం, నీతి, తత్వశాస్త్రం, న్యాయశాస్త్రం, రాజనీతి మాత్రం మారకుండా నిలిచే వున్నాయి."

" అంతేకాదు. సమాజంయొక్క అన్ని దశల్లోనూ న్యాయం, ధర్మం, స్వేచ్ఛ మొదలైన శాశ్వత సత్యాలు మారకుండా నిలచి ఉన్నాయి. వాటన్నిటిని కమ్యూనిజం నాశనం చేస్తుంది. అందుచేత కమ్యూనిజం చారిత్రకానుభవానికే వ్యతిరేకం."

మాపై చేయబడిన ఈ ఆరోపణకు అర్ధ మేమిటో పరిశీలిద్దాం.

మానవసమాజంయొక్క గత చరిత్ర అంతా వర్గవైషమ్యాల (Class Antagonisms) తీవ్రతమీద ఆధారపడుతూ వచ్చింది. ఈ వైషమ్యాలు వివిధదశల్లో వివిధరూపాలు ధరిస్తూ వచ్చాయి. కాని, ఏ యే రూపాలు ధరించినప్పటికీ, అన్నిదశల్లోను ఒకటిమాత్రం స్పష్టంగా మనకు కన్పిస్తుంది. అది యేమంటే మానవ సమాజంలో ఒక భాగానికి చెందిన వారు మరొకభాగానికి చెందినవారిని దోచుకోవటం. అందుచేత సమాజంయొక్క చైతన్యం గతయుగాలలో ఎన్ని రూపాలు ధరించినప్పటికీ, అన్ని యుగాలకు సమానంగా వర్తించే కొన్ని సాధారణరూపాలలో, సాధారణభావాలలో అది వ్యక్త మవుతూ వచ్చింది. ఇది ఆశ్చర్యకర విషయ మేమీకాదు. ఇవన్నీ వర్గ వైషమ్యాలు నాశనమైతేకాని మాయంకావు (No wonder, then, that the social consciousness of past ages, despite all the multiplicity and variety it displays, moves within certain common forms, or general ideas, which cannot completely vanish except with the total disappearance of class antogonisms.)

కమ్యూనిస్టు విప్లవం సాంప్రదాయ సిద్ధమైన ఆస్తి సంబంధాలన్నిటిని పూర్తిగా విచ్ఛిన్నం చేస్తుంది. అందుచేత కమ్యూనిస్టు విప్లవం పెంపొందడమంటే అర్థం, సాంప్రదాయ సిద్ధమైన అభిప్రాయాలన్నీ పూర్తిగా ధ్వంసం కావడమన్న మాట.

కమ్యూనిజాన్ని గురించి పెట్టుబడిదారులు చేసే ఆక్షేపణలు ఇంతటితో ముగించుదాం.

కార్మికవర్గం తీసుకొచ్చే విప్లవంలో మొట్టమొదటి చర్య, శ్రామికవర్గమే పాలకవర్గంగా అధికారాన్ని హస్తగతం చేసుకోవడం. ప్రజాతంత్ర స్థాపనకై సాగించే పోరాటంలో విజయం సాధించడం, అని పైన చెప్పాం.

ఇలా శ్రామికవర్గం తాను సాధించిన రాజకీయాధికారాన్ని కొన్ని ప్రధాన కర్తవ్యాలను నిర్వహించడానికి ఉపయోగించుకుంటుంది. అవి: క్రమక్రమంగా పెట్టుబడిదారీవర్గంనుంచి పెట్టుబడిని స్వాధీనం చేసుకోవడం; ఉత్పత్తి సాధనాలన్నిటినీ ప్రభుత్వమే, అనగా పాలకవర్గంగా సంఘటితపడ్డ శ్రామికవర్గ ప్రభుత్వమే, తన చేతుల్లోకి తెచ్చుకోవడం; ఉత్పత్తి శక్తుల్ని సాధ్యమైనంత వేగంగా అభివృద్ధిచేయడం. *

---

* శ్రామిక నియంతృత్వాన్ని గురించి కామ్రేడ్ స్టాలిన్ ఇలా వ్రాశారు:

"పాలకవర్గం తన వర్గశత్రువుల ప్రతిఘటనను అణచడానికి ఉపయోగించుకొను సాధనమే రాజ్యాంగయంత్రం. ఈవిషయంలో శ్రామిక నియంతృత్వానికీ, ఇతరవర్గాల నియంతృత్వానికీ ప్రధానంగా భేదమేమీ

లేదు. ఎందుచేతంటే, శ్రామికవర్గ రాజ్యాంగ యంత్రం పెట్టుబడిదారీ వర్గాన్ని అణచడంలో ఒక సాధనంగా ఉపయోగపడుతుంది. కాని, రెండిటికీ ఒక ప్రధాన భేదం వుంది. ఇంతవరకూ అధికారం చెలాయించిన రాజ్యాంగయంత్రాలన్నీ అధిక సంఖ్యాకులయిన పీడిత ప్రజల్ని కొద్దిమంది దోపిడీగాండ్రు అణచడాని కేర్పడ్డ నియంతృత్వాలు. శ్రామిక నియంతృత్వం అలాంటిదికాదు. అధిక సంఖ్యాకులైన పీడితప్రజలు కొద్దిమంది దోపిడీగాండ్రను అణచడాని కేర్పడ్డ నియంతృత్వమే శ్రామిక నియంతృత్వం..."

"దీన్నుంచి రెండు ప్రధాన విషయాలు ఉత్పన్నమవుతాయి. మొదటిది: శ్రామిక నియంతృత్వమంటే ధనికులకూ, పేదలకూ సమానంగా వర్తించే "సంపూర్ణ" ప్రజాతంత్రంకాదు. అందరికీ ప్రజాతంత్రంకాదు. 'శ్రామిక నియంతృత్వం' ఒక క్రొత్తవిధమైన ప్రజాతంత్ర ప్రభుత్వంగా ఉండాలి. శ్రామికవర్గానికీ, ఆస్తిలేనివారందరికీ అది ప్రజాతంత్ర ప్రభుత్వం. అదే ఒక క్రొత్తవిధమైన నియంతృత్వంకూడా. పెట్టుబడిదారీ వర్గానికి వ్యతిరేకమైన నియంతృత్వంఅది..." (లెనిన్ సెలెక్టెడ్ వర్క్స్ 7 వ వాల్యూమ్) కాట్స్కీ మురా దోపిడీచేసే వర్గానికీ, దోపిడీ చేయబడు వర్గాలకు మధ్య సమానత్వం అసంభవమనే వాస్తవాన్ని మరుగుపరచేటందుకు 'సర్వసమానత్వ' మనీ 'స్వచ్ఛమైన' ప్రజాతంత్రమనీ, 'సంపూర్ణమైన' ప్రజాతంత్రమనీ, కబుర్లుచెబుతారు. ఇవన్నీ పెట్టుబడిదారుల ప్రయోజనాలను కప్పిపుచ్చే ముసుగులు. కార్మిక వర్గంలో పైభాగానికి చెందినవారి సిద్ధాంతమే 'స్వచ్ఛమైన' ప్రజాతంత్ర సిద్ధాంతం. వీరు సామ్రాజ్యవాద దొంగలపోషణక్రింద బాగా మేపబడుతున్నారు. ఈసిద్ధాంతం పెట్టుబడిదారీ విధానంలోని కుళ్లును కప్పిపెట్టడానికి, సామ్రాజ్యవాదాన్ని నిలబెట్టియుంచడానికీ, పీడితప్రజలకు వ్యతిరేకంగా సామ్రాజ్యవాదులుసాగించే పోరాటానికి నైతికబలం చేకూర్చడానికీ మాత్రమే లేవదీయబడింది. పెట్టుబడిదారీ విధానంలో పీడితప్రజలకు నిజమైన స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు వుండవు. ఉండటానికి అవకాశమేలేదు. ఎందుచేతంటే వాటిననుభవించటానికి కావలసిన స్థలాలు, ముద్రణాలయాలు, కాగితం మొదలైనవన్నీ దోపిడీగాండ్ర సొంతఆస్తులు. పెట్టుబడిదారీ విధానంలో పీడితప్రజలు పరిపాలనా వ్యవహారాలలో పాల్గొనడం అసంభవం. ఎందుచేతంటే, పెట్టుబడిదారీవిధానం

ఉన్నంతకాలం ఎంత గొప్ప ప్రజాతంత్ర ప్రభుత్వమైనా అది ప్రజలచేగాక రాత్ ఛైల్డ్స్, ప్రిన్స్ రాక్ఫెల్లర్, మార్గన్ వంటి కోటీశ్వరులచే నెలకొల్ప బడేదే. పెట్టుబడిదారీ విధానంలో ప్రజాతంత్రం 'పెట్టుబడిదారీ' ప్రజాతంత్రం. అధిక సంఖ్యాకులైన పీడిత ప్రజల హక్కులను సంకుచితపరచడం కోసం ఏర్పడే కొద్దిమంది దోపిడీవర్గాల ప్రజాతంత్రం అది. శ్రామిక నియంతృత్వం క్రింద మాత్రమే ప్రజల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు గ్యారంటీ చేయ బడతాయి. పరిపాలనా వ్యవహారాలలో వారు పాల్గొనగల్గుతారు. శ్రామిక నియంతృత్వం క్రింద ఏర్పడ్డ ప్రజాతంత్రం 'శ్రామిక' ప్రజాతంత్రం. అధిక సంఖ్యాకులైన పీడిత ప్రజల ప్రజాతంత్రం; అల్పసంఖ్యాకులైన దోపిడీ దారుల హక్కులను సంకుచితపరచడంకోసం, వారికి వ్యతిరేకంగా పరిపాలన సాగించడంకోసము ఏర్పడ్డ ప్రజాతంత్రం."

"రెండవ విషయం: పెట్టుబడిదారీ సమాజం, పెట్టుబడిదారీ ప్రజా తంత్రం, శాంతియుతంగా పెంపొందడంవల్లకాదు, శ్రామిక నియంతృత్వం ఏర్పడేది. బూర్జువా రాజ్యాంగ యంత్రాన్ని, బూర్జువా అధికార వర్గాన్ని బూర్జువా సైన్యాన్ని, బూర్జువా పోలీసుదళాన్ని నాశనంచేసిన ఫలితంగా శ్రామిక నియంతృత్వం ఏర్పడుతుంది." (ప్రాబ్లెమ్స్ ఆఫ్ లెనినిజం)

శ్రామిక విప్లవాన్ని విజయవంతంగా కొనసాగించడానికి శ్రామిక నియంతృత్వం నెరవేర్చవలసిన కర్తవ్యాలను వివరిస్తూ కామ్రేడ్ స్టాలిన్ ఇలా వ్రాశాడు:

"విప్లవంయొక్క ప్రధానసమస్య అధికారానికి సంబంధించిన సమస్య అన్నాడు లెనిన్. అయితే అధికారాన్ని హస్తగతం చేసుకోవడంతోనే కర్తవ్యం పూర్తిఅవుతుందా? కాదు. ప్రారంభంలో నిర్వహించవలసిన కర్తవ్యం మాత్రమే అది. అధికారాన్ని హస్తగతం చేసుకున్న తర్వాత చాలాకాలం వరకూ పెట్టుబడిదారీవర్గం అనేక కారణాలవల్ల తనను కూల దోసిన శ్రామికవర్గంకంటే బలంగా వుంటుంది. అందుచేత శ్రామికవర్గం తాను సంపాదించిన అధికారాన్ని నిలబెట్టుకోవడం, గట్టిపరచుకోవడం, అజేయమైన శక్తిగా చేసుకోవడం, ప్రధాన కర్తవ్యం. ఈ కర్తవ్యాన్ని నెరవేర్చాలంటే విజయం పొందిన మరుక్షణం నుంచీ శ్రామికనియంతృత్వం మూడు కనీసవిధులను నెరవేర్చాలి: 1. విప్లవంలో కూలదోయబడిన

భూస్వాములయొక్క, పెట్టుబడిదారులయొక్క ప్రతిఘటనను భగ్నం చేయాలి; వారు తిరిగి తమ అధికారాన్ని స్థాపించుకోవటానికి చేసే ప్రయత్నాలన్నిటిని ఓడించాలి. 2. కష్టజీవులంతా శ్రామికవర్గం చుట్టూ సమీకరించబడేటట్లుగా నిర్మాణ కార్యక్రమం ఉండాలి. చివరకు వర్గాలే నాశనం చేయబడేటట్లు ఆ కార్యక్రమం కొనసాగించాలి. 3. విదేశ శత్రువులతో, సామ్రాజ్యవాదులతో పోరాడుటకు అవసరమైన విప్లవ సైన్యాన్ని నిర్మించాలి."

"పై మూడు కర్తవ్యాలను నెరవేర్చేటందుకు శ్రామిక నియంతృత్వం అవసరం". ('ప్రాబ్లమ్స్ ఆఫ్ లెనినిజం')

కామ్రేడ్ లెనిన్ శ్రామికనియంతృత్వాన్ని ఇలా నిర్వచించాడు: "శ్రామిక నియంతృత్వమంటే, కూలద్రోయబడినప్పటికీ పూర్వంకంటే 10 రెట్లు బలంకలిగిన పెట్టుబడిదారీవర్గంతో నూతనవర్గం (శ్రామిక వర్గం) సాగించే తీవ్రమైన, కఠినమైన పోరాటం. రక్తపాతంతోనూ, రక్తపాతరహితంగానూ, బలప్రయోగంతోనూ, శాంతియుతంగానూ, మిలిటరీ వ్యవహారాల్లోనూ, ఆర్థికవిషయాల్లోనూ, విద్యావిషయాల్లోనూ, పరిపాలనారంగంలోనూ, పాతసామాజిక శక్తులకూ సాంప్రదాయాలకూ వ్యతిరేకంగా చేయవలసిన ఎడతెగని పోరాటమే శ్రామిక నియంతృత్వం" ("సెలెక్టెడ్ వర్క్స్ 10 వ సంపుటం")

శ్రామిక నియంతృత్వ మంటే పట్టణకార్మికులు రైతాంగంమీద అధికారం చెలాయించడమనీ, రైతాంగాన్ని బానిససంకెళ్ళలో బంధించడమనీ కొందరు కాంగ్రెసు ప్రముఖులు మనదేశంలో గొంతులు బొంగురుపోయేట్లు అరుస్తున్నారు. ఇలాంటివారు లెనిన్ కాలంలోకూడా ఉండేవారు. వారి వక్రభాష్యాలకు లెనిన్ వ్రాసిన క్రిందివాక్యాలు చక్కనిజవాబు:

"కష్టజీవులలో అగ్రగామియైన శ్రామికవర్గానికీ, అసంఖ్యాకులైన ఇతర కష్టజీవులకూ (అనగా మధ్యతరగతి ప్రజలు, చిన్న యజమానులు, రైతాంగం, విద్యార్థులు వగైరా) లేదా వారిలో అధికసంఖ్యాకులకూ మధ్యఏర్పడ్డ స్నేహసంబంధంయొక్క ప్రత్యేక స్వరూపమే శ్రామికవర్గ నియంతృత్వం. ఈసంబంధం పెట్టుబడిదారీవర్గానికి వ్యతిరేకంగా, ఆవర్గాన్ని పూర్తిగా నిర్మూలించేటందుకూ, ఆవర్గంయొక్క ప్రతిఘటనను నాశనం

చేసేటందుకు, ఆవర్గం తిరిగి అధికారంలోనికి రావడానికి చేసే ప్రయత్నాలను భగ్నంచేసేటందుకు, చివరకు సోషలిస్టుసమాజాన్ని స్థాపించి, దాన్ని గట్టిపర చేటందుకు, ఏర్పడ్డ స్నేహసంబంధం. ఇది కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో, అనగా భయంకరమైన అంతర్యుద్ధం కొనసాగుతూండగా, నిర్మింపబడింది. సోషలిజాన్ని గట్టిగా బలపరచేవారికీ, ఇటూ అటూ ఊగిసలాడే శ్రామికవర్గ మిత్రులకూ మధ్య, యీ స్నేహసంబంధం ఏర్పడింది. ఒక్కొక్కప్పుడు తటస్థులుకూడా చేరటం సంభవిస్తుంది. (అట్టి సందర్భాలలో తటస్థులు సమిష్టి పోరాటంలో పాల్గొనటాని కంగీకరించకపోయినా శత్రువర్గంతో చేరకుండా ఉంటేటాని కంగీకరిస్తారు.) స్పష్టంగా చెప్పాలంటే, యీ స్నేహ సంబంధం ఆర్థికంగానూ, రాజకీయంగానూ, సామాజికంగానూ, సిద్ధాంత విషయాల్లోనూ, భేదించే అనేకవర్గాల మధ్య స్నేహసంబంధం" ("సెలక్టెడ్ వర్క్స్; రష్యన్ కూర్పు, 24 వాల్యూమ్)

శ్రామిక నియంతృత్వంయొక్క నిర్మాణస్వరూపమే సోవియట్ రాజ్యాంగం. దీనికీ, బూర్జువాపార్లమెంటరీ రాజ్యాంగానికీ, పోలిక ఎక్కడా లేదు. కష్టజీవులనందర్నీ పూర్తిగా విముక్తిజేసి, శ్రామికనియంతృత్వం నెరవేర్చవలసిన కర్తవ్యాలను పూర్తిచేయటమే సోవియట్ రాజ్యాంగంయొక్క ఆశయం.

రెండవ ప్రపంచయుద్ధం తరువాత తూర్పు యూరప్‌లో ఏర్పడ్డ నూతన ప్రజాతంత్ర రాజ్యాలుకూడా (పోలెండ్, రుమేనియా, బల్గేరియా మొ॥) శ్రామిక నియంతృత్వంయొక్క రూపాలే. శ్రామిక నియంతృత్వం యొక్క కర్తవ్యాలనే అవి నెరవేరుస్తూ సోషలిజంవైపు పురోగమిస్తున్నాయి.

కామ్రేడ్ డిమిట్రోవ్ బల్గేరియన్ కమ్యూనిస్టుపార్టీ 5వ మహా సభలో (1948 డిశంబరు) యిలా చెప్పారు.

"మార్క్సిస్టు, లెనినిస్టు సిద్ధాంతాలప్రకారం సోవియట్ రాజ్యాంగం, నూతన ప్రజాతంత్ర రాజ్యాంగం, ఒకే పరిపాలనావిధానంయొక్క రెండు ప్రత్యేకస్వరూపాలు. శ్రామికవర్గం పట్టణాలలోనూ, పల్లెలలోనూ ఉండే కష్టజీవుల సహకారంతో, వారికి నాయకత్వం వహిస్తూ, పరిపాలన కొన సాగిస్తే, దాన్ని శ్రామికనియంతృత్వమంటాం. ఈ శ్రామికనియంతృత్వం

ప్రారంభదశలో ఈ కర్తవ్యాలను నిర్వహించాలంటే, వ్యక్తుల ఆస్తి హక్కుమీద, బూర్జువా ఉత్పత్తి పద్ధతుల మీద నిర్దాక్షిణ్యంగా దాడి చేయవలసి వస్తుంది. ప్రభుత్వం ఆర్థికరంగంలో పైకి స్వల్పమైనవిగాను, సమర్థించ వీలులేనివిగాను కనబడే కొన్ని చర్యలు తీసుకోవలసియుంటుంది. ఐతే ఉద్యమము ముందుకుసాగేకొద్దీ పాత సామాజికవ్యవస్థమీద ఇంకా పెద్దదాడులు చేయవలసియుంటుంది. ఉత్పత్తి విధానాన్నంతటినీ మార్చివేయడానికి అట్టి చర్యలు తప్పనిసరి అవుతాయి.

ఈ చర్యలు సహజంగా వివిధదేశాల్లో వివిధరూపాలు దాలుస్తాయి.

కాని బాగా అభివృద్ధి చెందిన దేశాల్లో ఈ క్రింది కార్యక్రమాన్ని సర్వసాధారణంగా వర్తింపజేయవచ్చు.

1. భూమిని వ్యక్తుల సొంత ఆస్తిగా ఉంచుకునే పద్ధతిని రద్దుచెయ్యాలి. భూమినుంచి వసూలయ్యే శిస్తులను ప్రజా సౌకర్యాలకై వినియోగించాలి.

---

యొక్క ప్రత్యేక స్వరూపాలే పై రెండు రాజ్యాంగాలు. బల్గేరియాలో పెట్టుబడిదారీ విధానంనుంచి సోషలిజంవరకు పురోగమించవలసిన పరివర్తనదశ ఒక ప్రత్యేకరూపం ధరించినంతమాత్రాన, పెట్టుబడిదారీ విధానంనుంచి, సోషలిజంవరకూ ఉండే పరివర్తనదశయొక్క మూల సూత్రాలు మారవు. అవి అన్ని దేశాలకూ సమానంగానే వర్తిస్తాయి. పెట్టుబడిదారీ శక్తులకు వ్యతిరేకంగానూ, సోషలిస్టు వ్యవస్థను నిర్మించేటందుకు, శ్రామిక నియంతృత్వం లేకపోతే సోషలిజంవైపు పురోగమించడం దుర్లభం...”

—అనువాదకుడు.

2. ఆదాయపుపన్నును వృద్ధిక్రమానుసారంగా విధింప చేయాలి; ఆదాయం హెచ్చేకొద్దీ పన్ను రేట్లనుకూడా ఎక్కువ చెయ్యాలి.

3. వారసత్వపు హక్కును రద్దుచెయ్యాలి.

4. దేశం విడిచిపెట్టి పారిపోయిన ద్రోహుల ఆస్తిని, తిరుగుబాటుదార్ల ఆస్తిని స్వాధీనం చేసుకోవాలి.

5. ప్రభుత్వపు పెట్టుబడితో జాతీయ బ్యాంకు ఒకటి నిర్మింపబడాలి. అప్పు ఇచ్చే అధికారం ఆ బ్యాంక్‌కు తప్ప మరెవరికీ ఉండకూడదు. ఈ పద్ధతివల్ల ప్రభుత్వం చేతుల్లోనే అప్పులిచ్చే అధికారం కేంద్రీకరింపబడుతుంది.

6. రాకపోకమార్గాలను, కమ్యూనికేషన్లను (అనగా తపాలా, తంతి, టెలిఫోన్లు వగైరా) ప్రభుత్వమే స్వాధీనం చేసుకుని నిర్వహించాలి.

7. ప్రభుత్వం స్వాధీనంచేసుకున్న ఫ్యాక్టరీలను, ఉత్పత్తి సాధనాలను కొత్తప్రాంతాలకు విస్తరింపచేయాలి. బంజరు భూములన్నిటినీ సేద్యంలోకి తీసుకరావాలి. మొత్తం భూమి నంతటినీ ప్లానుప్రకారం సారవంతంగా చెయ్యాలి.

8. ప్రజలందరూ తప్పనిసరిగా పనిచేసితీరాలి. పారిశ్రామిక కార్మికుల్ని దళాలుగా నిర్మించి వారి సహాయంతో ప్రధానంగా వ్యవసాయాన్ని అభివృద్ధి చేయాలి.

9. వ్యవసాయానికీ, పరిశ్రమలకూ మధ్య సమన్వయం ఉండేటట్లు చూడాలి. దేశ జనాభాను ఒక సక్రమపద్ధతిని పంపకము చేయటంద్వారా పల్లెలకూ, పట్టణాలకూ మధ్య గల వ్యత్యాసాన్ని క్రమంగా రద్దుచెయ్యాలి.

10. బాలబాలికలందరికి ప్రభుత్వ పాఠశాలల్లో ఉచితంగా చదువునేర్పాలి. బాలబాలికలు యిప్పటివలె ఫ్యాక్టరీలలో పనిచేసేపద్ధతిని నిర్మూలించాలి. విద్యావిధానానికి, పారిశ్రామికోత్పత్తికీ అవినాభావసంబంధం ఉండేటట్లు చూడాలి.

ఇలాంటివే మరికొన్ని యితర చర్యలుకూడా తీసుకోవటం అవసరంకావచ్చు.

ఈ విధంగా సమాజం అభివృద్ధిచెందేకొద్దీ వర్గభేదాలు మాయమవుతాయి. వస్తూత్పత్తి జాతికంతకూ చెందిన ఒకే పెద్దసంఘం చేతుల్లో కేంద్రీకరింపబడుతుంది. అలాంటి పరిస్థితుల్లో ప్రభుత్వానికి రాజకీయ స్వభావంలేకుండా పోతుంది. వాస్తవానికి ప్రభుత్వమంటే ఒకవర్గం మరోవర్గాన్ని అణచి ఉంచేటందుకు ఉపయోగపడే ఒక నిర్మాణాత్మకశక్తి. శ్రామికవర్గం పెట్టుబడిదారీవర్గంమీద పోరాటం సాగించేదశలో ఒకే వర్గంగా సంఘటితమైనప్పుడు; విప్లవంద్వారా ఆ వర్గం పాలకవర్గంగా అధికారంలోకి వచ్చినప్పుడు; తద్వారా పాత ఉత్పత్తి విధానాన్ని బలప్రయోగంతో తుడిచిపెట్టిన తరువాత; యీ ఉత్పత్తివిధానంతోబాటు వర్గాలు, వర్గవైరుధ్యాలు ఏర్పడ్డానికవసరమైన పరిస్థితుల్నికూడా అది నిర్మూలిస్తుంది. తద్వారా అది తన వర్గ ఆధిక్యతను నిర్మూలించుకొంటుంది.

ఈవిధంగా వర్గాలూ, వర్గవైషమ్యాలూ ఉండే పాత పెట్టుబడిదారీసమాజం నశించి దానిస్థానే వర్గరహితసమాజం ఏర్పడుతుంది. అందులో ప్రతివ్యక్తి స్వేచ్ఛగా అభివృద్ధిచెందే ప్రాతిపదికపై అందరూ స్వేచ్ఛగా అభివృద్ధిచెందడానికి అవకాశమేర్పడుతుంది.



III

# సోషలిస్టు, కమ్యూనిస్టు రచనలు

## 1. అభివృద్ధి నిరోధక సోషలిజం

(ఎ) ఫ్యూడల్ సోషలిజం : ఫ్రాన్సు, ఇంగ్లండు దేశాల్లో ఫ్యూడల్ జమీందారీవర్గాలకు గల చారిత్రకస్థానాన్ని బట్టి ఆ వర్గాలు ఆధునిక పెట్టుబడిదారీ సమాజాన్ని ఖండిస్తూ అనేక కరపత్రాలు వ్రాయడం తమ వృత్తిగా పెట్టుకున్నాయి. జూలై 1830 లో ఫ్రాన్సులో జరిగిన విప్లవంలోనూ, పార్లమెంటరీ సంస్కరణలపై ఇంగ్లండులో జరిగిన ఆందోళనలోనూ, ఫ్యూడల్ వర్గాలు తాము ద్వేషిస్తూ వచ్చిన కొత్తశత్రువు ముందు మరొకసారి తలవొంచవలసివచ్చింది. అప్పటినుంచీ యీ వర్గాలు పెట్టుబడిదారీవర్గంతో తీవ్రమైన రాజకీయ పోరాటం జరపడం అసంభవమైంది. కేవలం గ్రంథరచన ద్వారా మాత్రమే పోరాడ్డానికి అవకాశం ఉండేది. కాని యీ సాహిత్యరంగంలో కూడా రెస్టొరేషన్ దశనాటి (పునరుజ్జీవనదశ) పాతపోరాట నినాదాలతో ముందుకురావడం అసంభవమయింది. *

---

* ఇక్కడ రెస్టొరేషన్ దశ అంటే, 1665 నుంచీ 1689 వరకూ కొనసాగిన ఇంగ్లీషు రెస్టొరేషన్ కాదు; 1814 నుంచి 1830 వరకూ సాగిన ఫ్రెంచి రెస్టొరేషన్.

—ఎంగెల్సు.

ఈ ఫ్యూడల్ వర్గాలు ప్రజల్లో తమపట్ల సానుభూతిని సంపాదించుకోవడానికి, తమ స్వంత ప్రయోజనాలను గురించి ఏమీ పట్టించుకోనట్లూ, పీడింపబడే కార్మికుల ప్రయోజనాల రక్షణకోసమే తాము పెట్టుబడిదారీవర్గాన్ని వ్యతిరేకిస్తున్నట్లూ నటించవలసివచ్చింది. ఈ విధంగా జమీందారీవర్గాలు తమ కొత్త యజమానిని గురించి అపహాస్యంతో కూడిన దూషణ పద్యాలు చదవడంద్వారానూ, వాని చెవులో రహస్యంగా ముందుముందు రానున్న మహోపద్రవాన్ని గురించి భయం కలిగించే విధంగా జ్యోతిష్యాలు చెప్పడం ద్వారాను, కక్ష సాధించుకొనేవారు.

కాబట్టి ఫ్యూడల్ సోషలిజం సగం ఏడ్పులతోనూ, సగం వెక్కిరింపులతోనూ, సగం పాతభావాల ప్రతిధ్వనులతోనూ, సగం రానున్న ఉపద్రవాల బెదరింపులతోనూ జన్మించింది. ఒకొక్కప్పుడు ఫ్యూడల్ సోషలిస్టుల విమర్శనలు పెట్టుబడిదార్ల గుండెల్లో బల్లెపుపోట్లవలె అతికఠినంగా, అతినిశితంగా వెక్కిరింపులతో నిండివుండేవి. వీరు ఆధునిక చరిత్రయొక్క గమన సూత్రాలు తెలుసుకోలేకపోవడంవల్ల వీరిరచనలు ఎల్లప్పుడూ అపహాస్యంతోనే నిండియుండేవి.

ఈ జమీందారీవర్గాలు ప్రజల్ని తమవైపు తిప్పుకోడానికి, శ్రామికవర్గం ఎదుట పోరాటపతాకానికి బదులు భిక్షాపాత్రతో తయారయ్యేవారు. కాని, వారి మోసాన్ని ప్రజలు ఎప్పటికప్పుడు గ్రహిస్తూనేవచ్చారు. తమతరఫున మాట్లాడుతూన్నట్లు నటించే యీ గోముఖ వ్యాఘ్రాల అసలు రంగును

ప్రజలు కనిపెట్టి హేళనగా విరగబడి నవ్వేవారు; తిరస్కార భావంతో తొలగిపోయేవారు.

ఫ్రెంచి లెజిటిమిస్టులలో (Legitimists) ఒకగ్రూపుకు చెందినవారూ, "యంగ్ ఇంగ్లండ్" అను సంఘంలోని సభ్యులూ, యీ తరగతికి చెందిన సోషలిస్టులే.

ఫ్యూడల్ సోషలిస్టులు, పెట్టుబడిదారుల దోపిడీకీ, ఫ్యూడల్ వర్గాల దోపిడీకీ చాలా భేదంవున్నట్లు చూపుతారు. కాని ఆ పరిస్థితులు వేరు, నేటి పరిస్థితులు వేరు అనే విషయాన్ని మర్చిపోతారు. ఫ్యూడల్ వర్గాలహయాంలో ఆధునిక శ్రామిక వర్గం ఉండేదికాదని వీరి వాదన. కాని ఆ ఫ్యూడల్ సమాజం నుంచే ఆధునిక పెట్టుబడిదారీవర్గం ఉద్భవించిందని వీరు గుర్తించరు.

వీరు తమ అభివృద్ధి నిరోధకత్వాన్ని ఎంతబాహాటంగా దాపరికంలేకుండా బయటపెట్టుకుంటున్నారంటే, పెట్టుబడిదారీ వర్గం అధికారంలోకి రావడంవల్లనే పాతసామాజిక వ్యవస్థను కూకటివ్రేళ్ళతో నాశనంచేసే కొత్తవర్గం (శ్రామికవర్గం) అభివృద్ధిచెందుతూందని వీరు విలపిస్తున్నారు. వీరు పెట్టుబడి దారీవర్గంమీద చేసే ప్రధాన ఆరోపణ యిదే.

అందుచేత వీరు పెట్టుబడిదారీవర్గాన్ని వ్యతిరేకించడానికి కారణం అది శ్రామికవర్గాన్ని సృష్టించిందనికాదు; ఈశ్రామిక వర్గం విప్లవకరమైన వర్గం అని.

అందుచేతనే, వీరు రాజకీయరంగంలో ప్రవేశించవలసి వచ్చేసరికి, నిరంకుశ ప్రభుత్వాలు కార్మికవర్గాన్ని అణచడం కోసం తీసుకొనే ప్రతిచర్యకు తమ ఆమోదం తెలియజేస్తూ

వచ్చారు. పైకి వీరెంత గంభీరంగా మాట్లాడినా నిత్యజీవితంలో అతి నీచంగా ప్రవర్తిస్తున్నారు. ఆధునిక పరిశ్రమలద్వారా వచ్చే లాభాలలో భాగం పంచుకొనేటందుకు వీరు పలువిధాలుగా దేవురిస్తున్నారు. పైకి సత్యం జయిస్తుందనీ, ప్రేమ ప్రధానమనీ, ఆత్మగౌరవం ఎంతో అవసరమనీ పెద్దపెద్దకబుర్లు చెబుతూ రెండవవైపున ఉన్ని, పంచదార, సారా మొదలైన వాటిలో వ్యాపారంచేసి లాభాలు గడిస్తున్నారు. ఈ లాభాల కోసం పై ఉన్న తాశయాలను తాకట్టు పెడుతున్నారు. *

సాధారణంగా జమీందారీవర్గం ఎక్కడుంటే క్రైస్తవ ఫాదరీలుకూడా అక్కడ ఉండితీరుతారు. అందువల్ల ఫ్యూడల్ సోషలిజం వ్యాప్తిచెందిన ప్రతిచోట క్రైస్తవ సోషలిజం కూడా ప్రచారంలోకి వచ్చింది.

క్రైస్తవమతం వైరాగ్యాన్ని బోధిస్తుంది. అట్టి బోధలకు సోషలిస్టురంగు పూయడం ఎంతో సులభమైన పని. క్రైస్తవ మతం స్వంత ఆస్తి కూడదని చెప్పలేదా? వివాహాలు చేసుకో

---

* ఇది ప్రధానంగా జర్మనీలో జరిగేది. ఆ రోజుల్లో జర్మన్ జమీందార్లకూ, భూస్వాములకూ పెద్దపెద్ద ఎస్టేట్లు వుండేవి. వాటిలో అధికభాగం స్టీవర్డ్సుచేత సాగుచేయించుకొనేవారు. అంతేకాక, బీట్ రూట్ అనే తియ్యని దుంపతో పంచదార తయారుచేసే ఫ్యాక్టరీలు వీరికి చాలా వుండేవి. బంగాళాదుంపతో సారా తయారుచేయడానికి బట్టీలు వుండేవి. బ్రిటన్‌లో జమీందారీవర్గం జర్మన్ జమీందార్లకంటే ధనవంతులు కనుక, ఇట్టి వ్యాపారం చేసేవారు కారు. అయినప్పటికీ, శిస్తులవల్ల వచ్చే ఆదాయం పడిపోతూంటే, వీరుకూడా ధనసంపాదనకు క్రొత్తమార్గాలు ఆలోచించారు. తమ పేర్లతో అనేక దొంగ జాయింట్ స్టాక్ కంపెనీలు తెరిపించి, వాటి మూలధనాన్ని హరించేవారు. — ఎంగెల్సు.

వద్దని హెచ్చరించ లేదా ? రాజ్యాంగ యంత్రాన్ని ఖండించ లేదా ? వీటికిబదులు దాతృత్వం, పేదరికం, బ్రహ్మచర్యం, శారీరకహింస, ఆధ్యాత్మికజీవితం, దైవభక్తి - ఇవి అలవరచుకోవాలని బోధించలేదా ? క్రైస్తవ ఫాదరీలు, క్రైస్తవ సోషలిజం అనే పుణ్యతీర్థంతో జమీందార్ల హృదయవేదనను కడిగివేస్తారు.

(బి) పెటీబూర్జువా సోషలిజం : పెట్టుబడిదారీవర్గం అధికారంలోకివస్తే నాశనమయేవారు ఫ్యూడల్ జమీందార్లేకాదు; జమీందార్ల పరిస్థితులేకాదు తారుమారయేది. మధ్యయుగాలలో వ్యాపారంవల్ల జీవించే బర్గర్లు, సొంతవ్యవసాయం చేసుకొనే చిన్న రైతులు, ఆధునిక పెట్టుబడిదారీవర్గంయొక్క అంకురాలే. పరిశ్రమలు, వ్యాపారం అంతగా అభివృద్ధిచెందని దేశాల్లో యీ రెండువర్గాలూ ఎదుగుబొదుగులు లేకుండా కొంతకాలం నిలచివుంటాయి. క్రమేణా అభివృద్ధిచెందుతున్న పెట్టుబడిదారీవర్గం ప్రక్కనే యీ రెండువర్గాలు తమ అస్తిత్వాన్ని కొంతకాలం నిలబెట్టుకోగల్గుతాయి.

అంతేగాక, ఆధునిక నాగరికత బాగా అభివృద్ధిచెందిన దేశాల్లో మధ్యతరగతిక్రిందికి వచ్చే కొత్తవర్గం వొకటి తల యెత్తుతుంది. ఇది శ్రామికవర్గానికీ, పెట్టుబడిదారీవర్గానికీ మధ్య ఊగిసలాడుతూ వుంటుంది. పెట్టుబడిదారీ సమాజంలోనే యిదొక అనుబంధశాఖగా వుంటూ, ఎప్పటికప్పుడు నూతన జీవంపోసుకొంటూ వృద్ధిచెందుతుంది. అయితే యీ వర్గంలోని వ్యక్తులుమాత్రం వ్యాపారపోటీవల్ల దెబ్బతింటూ, నిత్యమూ శ్రామికవర్గంలోకి యీడ్వబడతారు. అంతేకాదు, ఆధునిక

పరిశ్రమలు అభివృద్ధి చెందేకొద్దీ ఆధునిక సమాజంలో తా. మొక స్వతంత్రశక్తిగా పెంపొందడం అసాధ్యమనికూడా వీరు గ్రహిస్తారు. పరిశ్రమల్లోను, వ్యాపారంలోను, వ్యవసాయం లోను మేస్త్రీలు, గుమాస్తాలు, నౌకర్లు వచ్చి తమస్థానాల్లో ప్రవేశిస్తారని తెలుసుకుంటారు.

రైతాంగం ఫ్రాన్సువంటి కొన్ని దేశాల్లో సగం జనా భాకు మించివుంది. అలాంటిదేశాల్లో శ్రామికవర్గం తరఫున నిలబడి పెట్టుబడిదారీవర్గానికి వ్యతిరేకంగా పోరాడిన రచయిత లందరూ సహజంగా రైతాంగంయొక్క, యితర మధ్యతరగతి ప్రజలయొక్క ఆశయాలకోసం వారిదృక్పథంతో పోరాడారు. ఈ విధంగా బయల్దేరినదే పెటీబూర్జువా సోషలిజం. ఫ్రాన్సు, ఇంగ్లండ్ దేశాల్లో పెటీబూర్జువా సోషలిజానికి నాయకుడు సిస్మాండీ (Sismondi).

పెటీబూర్జువా సోషలిస్టులు ఆధునిక ఉత్పత్తివిధానం లోని అవకతవకలను, వైరుధ్యాలను నిశితంగా విడగొట్టి చూపడంలో సమర్థులు. బూర్జువా అర్థశాస్త్రజ్ఞుల బూటకపు సిద్ధాంతాలను ఎంతో చాకచక్యంగా వీరు విమర్శించి వాటి గుట్టును బయటపెట్టగలరు. యంత్రశక్తివల్ల, పనివిభజనవల్ల, కొద్దిమందిచేతుల్లోనే భూమి, పెట్టుబడి ఉన్నందువల్ల ఆర్థిక సంక్షోభాలవల్ల ఎట్టి అనర్థాలు కలుగుతాయో వీరు చక్కగా ఋజువుచేయగలరు. అంతేకాదు. ఎప్పటికైనా రైతాంగం, పెటీ బూర్జువావర్గం శిథిలంకావలసిన వర్గాలేనని నిరూపించ గలరు. శ్రామికవర్గం ఎంతదుర్భరమైన జీవితం గడుపుతోందో నేటి ఉత్పత్తి విధానంలో యెన్ని అవకతవక లున్నాయో,

పంపక విధానంలో యెంత అసమానత్వం ఉందో వీరు కండ్లకు కట్టినట్లు చిత్రిస్తారు. పెట్టుబడిదారులు తమ లాభాల కోసం వివిధ దేశాలమధ్య మారణయుద్ధాలెలా తీసుకొస్తున్నారో, మనిషికీ మనిషికీ మధ్య ఉండవలసిన నైతిక సంబంధాలెలా ధ్వంస మవుతున్నాయో, ప్రాచీన కుటుంబ సంబంధాలెలా తలక్రిందులయ్యాయో, పూర్వపు జాతులెలా విచ్ఛిన్న మవుతున్నాయో వర్ణిస్తారు.

అయితే వీరు పూర్వపు ఉత్పత్తిమారకపు సాధనాలనే పునరుద్ధరించాలంటారు. వాటితోబాటు పూర్వపు ఆస్తి సంబంధాలనూ, సామాజిక వ్యవస్థనూ మళ్ళీ తీసుకరావాలంటారు. లేదా పూర్వపు ఆస్తిసంబంధాల చట్రంలోనే ఆధునిక ఉత్పత్తి మారకపు సాధనాలను యిమడ్చాలంటారు. ఆ చట్రంలో యివి యిమడవనే విషయం వారికి తెలియదు. అలా యిమడ్చడానికి ప్రయత్నిస్తే చట్రమంతా—అంటే పాత ఆస్తి సంబంధాలు బ్రద్దలుకావడం తప్పదని వీరికి తెలియదు. పై రెండుమార్గాలలో దేన్నవలంబించినా అది అభివృద్ధిని నిరోధించేదే; ఊహాజనితమైనదే.

చివరకు వీరు సూచించే కార్యక్రమమేమిటి? పరిశ్రమల నిర్వహణకు వృత్తిసంఘాల (Guilds) స్థాపన, వ్యవసాయంలో పితృస్వామిక సంబంధాల పునరుద్ధరణ.

కాని చివరకు అతి కఠినమైన చారిత్రకసత్యాలు ఆత్మవంచనవల్ల కలిగిన యీ మత్తును పటాపంచలుచేసేసరికి పెటీబూర్జువా సోషలిజం ఆకాశంలోకి అంతర్ధానమైపోయింది.

(సి) జర్మన్ సోషలిజం లేక "వాస్తవిక" సోషలిజం : ఫ్రాన్సులో సోషలిస్టు, కమ్యూనిస్టురచనలు, పెట్టుబడిదారీవర్గం అధికారంలోకి వచ్చాకనే ఆ వర్గంపై ప్రారంభమైన పోరాటాల ప్రతిబింబంగా ఉద్భవించాయి. కాని జర్మనీలో అలాకాదు. అక్కడ ఫ్యూడల్ నిరంకుశత్వానికి వ్యతిరేకంగా పెట్టుబడిదారీ వర్గంపోరాటం ప్రారంభించినప్పుడు సోషలిస్టు, కమ్యూనిస్టురచనలు బయల్దేరాయి. జర్మన్ తత్వవేత్తలూ, కాబోయే జర్మన్ తత్వవేత్తలూ, రచయితలూ ఫ్రెంచి సామాజిక పరిస్థితులు జర్మనీలోకి దిగుమతికాలేదను వాస్తవాన్ని గుర్తించకుండా, ఫ్రెంచిరచనలను దిగుమతిచేసుకొని వాటన్నిటిని కుతూహలంగా అనుకరించసాగారు. ఇవి ఆనాటి జర్మన్ పరిస్థితుల కనుగుణ్యంగా లేనందున తక్షణ కార్యాచరణ కవి ఉపయోగపడలేదు; కేవలం సాహిత్య గ్రంధాలుగా మాత్రమే ఉండిపోయాయి. కనుకనే మొదటి ఫ్రెంచి విప్లవంయొక్క (1789) నినాదాలు 18వ శతాబ్దపు జర్మన్ తత్వవేత్తల దృష్టికి "ఆచరణ కనుగుణ్యమైన హేతువాదం"గా (Practical Reason) మాత్రమే కనుపించాయి. ఫ్రాన్సులో విప్లవపాత్ర వహించిన పెట్టుబడిదారుల ఆశయాలు వీరిదృష్టికి పవిత్రసంకల్పం యొక్క మూల సూత్రాలుగాను (Laws of Pure will), లేదా భవిష్యత్తులో తప్పక సిద్ధించే పరమావధులుగాను, నిజమైన మానవాశయాలుగాను కనుపించాయి.

జర్మన్ సాహిత్యవేత్తలు యీ నూతన ఫ్రెంచి సిద్ధాంతాలను తమ ప్రాచీన తత్వశాస్త్ర సిద్ధాంతాలతో సమన్వయించడానికే ప్రధానంగా కృషిచేశారు. ఇంకొకవిధంగా

చెప్పాలంటే వారు తమ తాత్విక దృక్పథాన్ని తుడిచిపెట్ట కుండానే ఫ్రెంచిభావాలను యిముడ్చుకోజూచారు.

సాధారణంగా మనమొక భాషలో ఉన్న భావాలను మరో భాషలోకి మార్చేటప్పు డేపద్ధతి నవలంబిస్తామో సరిగ్గా అదేపద్ధతిని వీరు కూడా అవలంబించారు. అంటే పుస్తకం తర్జుమా చేసినట్లు చేశారు.

పూర్వం క్రైస్తవేతరులయిన హీదెన్లు రచించిన పురాణగ్రంథాల వ్రాతప్రతులపై క్రైస్తవ సన్యాసులు క్యాథలిక్ ప్రవక్తల (Saints) జీవితగాథలు రచించిన విషయం జగద్విదితం. జర్మన్ రచయితలు ఈపద్ధతినే లౌకిక సమస్యలకు సంబంధించిన ఫ్రెంచిరచనలయెడ తలక్రిందులు చేశారు. వారు ఫ్రెంచిరచయితల మూలపాఠం క్రింద తమ తత్వశాస్త్రపు ఛాందసాన్ని చేర్చేవారు. ఉదాహరణకు ఫ్రెంచి సోషలిస్టులు ధనంయొక్క విధులను విమర్శిస్తూ వ్రాసిన వాక్యాల క్రింద "మానవత్వ విధ్వంసన" (Alienation of humanity) అని వ్రాసేవారు. బూర్జువా రాజ్యాంగయంత్రాన్ని ఖండిస్తూ వారు వ్రాసిన విమర్శనక్రింద "సాధారణత్వం పదవీభ్రష్టతపొందింది" (Dethronment of the Category of the general) అని వ్రాసేవారు.

ఈ విధంగా జర్మన్ రచయితలు ఫ్రెంచి చారిత్రక విమర్శనల్లోని తత్వశాస్త్ర శబ్దాలకు రకరకాల పేర్లు పెట్టే వారు. ఉదాహరణకు, "కార్య ప్రేరేపక తత్వశాస్త్రం" (Philosophy of Action) అనీ, "వాస్తవిక సోషలిజం" (True Socialism) అనీ, "జర్మన్ శాస్త్రీయ సోషలిజం" (German Scientific Socialism) అనీ, "సోషలిజం

గొక్క తత్వశాస్త్రపునాదులు" (Philosophical foundations of Socialism) అనీ, తమ గ్రంథాలకు నామకరణం చేశారు.

ఈ విధంగా వారు ఫ్రెంచి సోషలిస్టు, కమ్యూనిస్టు రచనలను నిర్వీర్యం చేశారు. ఇవి వారిచేతుల్లో వర్గపోరాటాన్ని వ్యక్తంచేసేవిగా లేనందున, ఫ్రెంచి రచయితల "పాక్షిక దృక్పథాన్ని" తాము అధిగమించగల్గినట్లు భావించేవారు. అందువల్లనే వారు ప్రజల వాస్తవిక అవసరాలను కాకుండా, వాస్తవికతయొక్క అవసరాలను (Not true requirements, but the requirements of truth) వ్యక్తపరుస్తున్నట్లు భావించేవారు. కేవలం శ్రామికుల ప్రయోజనాలనేకాకుండా, మానవజాతియొక్క ప్రయోజనాలన్నిటినీ తాము ప్రతిబింబిస్తున్నట్లు తలచేవారు. వీరి అభిప్రాయం ప్రకారం, మానవుడు ఏవర్గానికీ చెందని వ్యక్తి; అందుచేత వాస్తవికతకు అతడు అతీతుడు. తాత్విక సంబంధమైన మాయాప్రపంచంలో అతడొక ఊహాకల్పిత వ్యక్తి.

ఈ విధంగా జర్మన్ సోషలిజం, బడిపిల్లల విధులన్నిటినీ అతిభక్తితో, పవిత్రభావంతో నెరవేర్చ పూనుకొంది. తన చౌకబారు సరకులను ఎంతో వెకిలిగా పొగుడుకొంది. అందుకనే దాని దొంగఅమాయకత్వం క్రమంగా మాయమైంది. ఇంతకంటే జర్మన్ పెట్టుబడిదారీవర్గం, అందులోనూ ప్రష్యన్ పెట్టుబడిదారీవర్గం, ఫ్యూడల్ లార్డులతోనూ, నిరంకుశ రాచరికంతోనూ, చేసిన పోరాటమే – అనగా లిబరలిజమే – ఎక్కువ నిజాయితీగలదని చెప్పవచ్చు.

ఇందుమూలంగా "వాస్తవిక" సోషలిజం సోషలిస్టు నినాదాలలో రాజకీయోద్యమంలో పాల్గొనడాని కవకాశం కలిగింది. ఈ అవకాశం కొరకు చాలాకాలంనుంచి అది నిరీక్షిస్తూవచ్చింది. "వాస్తవిక" సోషలిస్టులు లిబరలిజాన్ని, పార్లమెంటరీ విధానాన్ని, వ్యాపారంలో పోటీపద్ధతినీ, బూర్జువా చట్టాలనూ, బూర్జువా స్వాతంత్ర్యాన్ని, బూర్జువా సమానత్వాన్ని, బూర్జువా పత్రికాస్వాతంత్ర్యాన్ని వ్యతిరేకించేటందుకు ప్రజల్లో చాలాకాలంనుంచి పాతుకుపోయివున్న మూఢ నమ్మకాలనుకూడా ప్రచారం చేయడాని కవకాశం కలిగింది. పెట్టుబడిదారీ విధానంవల్ల ప్రజలకు కలిగే లాభ మేమీ లేదనీ, అంతా నష్టమేననీ వీరు బోధించారు. అయితే వీరొక ప్రధానవిషయాన్ని మరచిపోయారు. అదేమంటే ఆధునిక పెట్టుబడిదారీసమాజం, దానిలో బాటు నూతన ఆర్థిక వ్యవస్థ, దాని కనుగుణ్యంగా రాజ్యాంగవిధానం యేర్పడ్డ తర్వాతనే ఫ్రెంచి రచయితలు తమ విమర్శలను ప్రారంభించారు. కాని జర్మనీలో యిట్టిపరిస్థితు లింకా యేర్పడ లేదు. అక్కడ వీటికై యింకా పోరాటం జరుగుతోంది. ఈ వాస్తవాన్ని జర్మన్ సోషలిస్టులు గుర్తించకుండా ఫ్రెంచి విమర్శనలను చిలకపలుకులవలె వల్లించారు.

వీరి రచనలు ఆనాటి ఫ్యూడల్ నిరంకుశప్రభుత్వాల కెంతో సహాయపడ్డాయి. ఈ ప్రభుత్వాలను మతాధిపతులూ, ప్రొఫెసర్లూ, ప్రభుత్వోద్యోగులూ, నిరంకుశాధికారులూ బాగా బలపరచేవారు. అధికారంకొరకు కొత్తగా తలయెత్తుతూన్న పెట్టుబడిదారీవర్గాన్ని భయపెట్టడంకోసం యీ నిరం

కుశ ప్రభుత్వాలు జర్మన్ సోషలిజాన్ని వినియోగించుకొన్నాయి. పంటచేలలో రైతులు దిష్టిబొమ్మను ఉపయోగించుకున్నట్లు ఉపయోగించుకున్నాయి.

ఇదే సమయంలో జర్మన్ కార్మికుల తిరుగుబాట్లను అణచివేయడంకోసం వారిపై తుపాకికాల్పులు, చిత్రహింసలు కొనసాగించుతూన్న నిరంకుశ ప్రభుత్వాల కత్తికి యీ జర్మన్ సోషలిజం తేనెపూతమాదిరిగా ఉపయోగపడింది.

ఈ విధంగా "వాస్తవిక" సోషలిజం ఒకవైపు జర్మన్ పెట్టుబడిదారీవర్గంపై నిరంకుశ ప్రభుత్వాలుచేసే పోరాటంలో నిరంకుశ ప్రభుత్వాల కొరకు ఆయుధముగా ఉపయోగపడింది. మరోవైపు అభివృద్ధి నిరోధకులకూ, జర్మన్ ఫిలిస్టైన్లకూ (Philistines) ♦ అది ప్రాతినిధ్యం వహించింది. 16 వ శతాబ్దంలో నశించకుండా మిగిలిపోయినవర్గం జర్మన్ పెటీబూర్జువావర్గం. అప్పటినుంచీ యిది అనేకరూపాల్లో మెడ తెగకుండా తలయెత్తుతూనే వుంది. ప్రస్తుత వ్యవస్థకు నిజమైన సాంఘిక పునాది యీ వర్గమే.

ఈ వర్గాన్ని రక్షించడమంటే అర్థం ప్రస్తుతం జర్మనీలో వున్న సామాజిక వ్యవస్థను కాపాడ్డమన్నమాటే. పారిశ్రామికంగానూ, రాజకీయంగానూ బూర్జువావర్గం అధికారానికి రావడమంటే, యీ పెటీబూర్జువావర్గం నశించడమన్నమాట.

---

♦ ఫిలిస్టైన్ అంటే అర్థం సోషలిజంయొక్క అవసరాన్ని ఒకవైపు గుర్తిస్తూనే వర్గపోరాటాలు ప్రత్యక్షం కనపడ్డప్పుడల్లా గడగడ వణికిపోయి ముఖ్యముగా కళ్లు తేలవేసే వ్యక్తి.

—అనువాదకుడు.

ఎందుచేతంటే, బూర్జువావర్గం అధికారానికి రావడంవల్ల పెట్టుబడి విపరీతంగా కేంద్రీకరింపబడుతుంది; శ్రామికవర్గం విప్లవశక్తిగా పైకివస్తుంది. ఈ రెండుపిట్టల్నీ "వాస్తవిక" సోషలిజం ఒకేదెబ్బతో పడగొట్టుతున్నట్లు కనిపించింది. అదొక అంటువ్యాధి మాదిరిగా వ్యాపించింది.

నిజానికి జర్మన్ సోషలిస్టుల "శాశ్వతసత్యాలన్నీ" ఎముకలగూడులోను, ముడతలచర్మంలోను, అందవిహీనంగా కనబడే వికృతరూపాలు. వాటిని ఆకర్షవంతంగా చేయడానికి ఆధ్యాత్మిక చింతలనే సన్నవలువలతో ముస్తాబుచేసేవారు. ఆ వలువలమీద చమత్కారవాక్యాలు అనే పుష్పాలుకుట్టి అలంకరించేవారు. ఈ తళుకుబెళుకులన్నీ చూచి విస్మయం చెందినప్రజలు వారిసరకులను విపరీతంగా కొనుక్కొనేవారు.

క్రమంగా యీ జర్మన్ సోషలిస్టులు పెటీబూర్జువా ఫిలిస్టైన్‌లతరఫున పనిచేయడమే తమవృత్తిగా పెట్టుకున్నారు. అదే తమ పవిత్ర కర్తవ్యమని భావించారు.

ప్రపంచంలోని జాతులన్నిటిలోను జర్మన్‌జాతి సర్వోత్కృష్టమైనదనీ, జర్మన్ మధ్యతరగతియే ఆదర్శమానవజాతి అనీ వీరు చెప్పేవారు. ఈ ఆదర్శమానవులుచేసే ప్రతి దుర్మార్గాన్నీ, ప్రతి నీచత్వాన్నీ సమర్థించడానికి వీరు నిగూఢమైన ఉన్నతమైన అర్థాలుచెప్పేవారు. సోషలిస్టుభావాలతో కూడిన వ్యాఖ్యానాలు చేసేవారు. ఇవన్నీ వాస్తవాని కెంతోదూరముగా ఉండేవి. చివరకు వీరెంతదూరం వెళ్ళారంటే, కమ్యూనిజంవల్ల "సర్వమూ పశుబలంతో ధ్వంసంచేయబడుతుం"దనీ,

అందుకు తాము వ్యతిరేకులమనీ, చెప్పుకున్నారు. అంతే కాదు. తాము వర్గపోరాటాలన్నింటినీ నిష్పక్షపాత దృష్టితో ద్వేషిస్తామని ప్రకటించుకున్నారు. నేడు (1847) జర్మనీలో వ్యాప్తిలోవున్న సోషలిస్టు, కమ్యూనిస్టు రచనలన్నీ ఏ కొద్ది గ్రంథాలో తప్ప యిట్టి దుర్గంధపూరితమైన, నిర్జీవమైన ,జాతికి చెందినవే.

2. <u>కన్సర్వేటివ్ సోషలిజం, లేక బూర్జువా సోషలిజం:</u>

పెట్టుబడిదారీ సమాజం చిరస్థాయిగా ఉండేటట్లు చేయడం కోసం, పెట్టుబడిదారీవర్గంలోనే కొందరు ప్రజల బాధలను నివారించాలని కోరుతారు.

ఆర్థికవాదులూ, పరోపకారపరాయణులూ, విశ్వ మానవ శ్రేయోభిలాషులూ, కార్మికజన బాంధవులూ, జీవ కారుణ్యవాదులూ, మద్యనిషేధ ప్రచారకులూ, అన్నదాన సమాజీకులూ, చినిగిపోయిన పాతబొంతకు అతుకులువేసే సంఘ సంస్కర్తలూ – యీ తరగతికి చెందినవారే. అంతే కాదు. ఇట్టి సోషలిజం ఒక సమగ్రమైన శాస్త్రరూపంలో ప్రచారమవుతోంది.

ఇందుకు ఉదాహరణగా, ప్రౌధాన్ రచించిన "దారిద్ర్యంయొక్క తత్వశాస్త్రం" (Philosophy of poverty) అనే గ్రంథాన్ని తీసుకోవచ్చు.

ఇలాంటి బూర్జువా సోషలిస్టులందరూ నేటి సామాజిక పరిస్థితులవల్ల లభ్యమయ్యే సదుపాయాలన్నింటిని అనుభవించ వలసిందేనంటారు; కాని ఆ పరిస్థితులవల్ల తప్పనిసరిగా వచ్చే పోరాటాలూ, ప్రమాదాలు మాత్రం పనికిరావంటారు. అంటే

ప్రస్తుత సామాజికవ్యవస్థ యిలాగే ఉండాలని వీరు కోరుతారు; కాని అందులో ఒక భాగమైన విప్లవశక్తులు మాత్రం నిర్మూలింపబడాలంటారు. శ్రామికవర్గంతో నిమిత్తంలేని పెట్టుబడిదారీవర్గం కావాలంటారు వీరు. పెట్టుబడిదారీవర్గం సహజంగా తనకు పెత్తనమున్న ప్రపంచమే ఉత్తమమైనదని భావిస్తుంది. ఇందు కనుగుణ్యమైన సిద్ధాంతాలనే బూర్జువా సోషలిస్టులు కొద్దోగొప్పో క్రమబద్ధంగా తయారుచేశారు; వాటి నమలు జరుపవలసిందని వీరు శ్రామికవర్గాన్ని ఆదేశిస్తున్నారు. అలా చేస్తే స్వర్గతుల్యమైన నూతన ప్రపంచంలో స్థానం లభిస్తుందంటున్నారు. కాని నిజమాలోచిస్తే, నేటి పెట్టుబడిదారీ పరిమితుల్లోనే శ్రామికవర్గం బ్రతికాలనీ, పెట్టుబడిదార్లయెడల వారు తమ ద్వేషాన్ని తొలగించుకోవాలనీ, వీరు ఆదేశిస్తున్నట్లు బోధపడుతుంది.

బూర్జువా సోషలిజంలోనే మరోరకంకూడా వుంది. ఇది అంతకంటె ఆచరణ కనుగుణ్యమైనది; కాని అంత సమగ్రమైన రూపం దీనికిలేదు. ఈ తరగతికి చెందిన సోషలిస్టులు కేవలం రాజకీయ సంస్కరణలవల్ల ప్రయోజనము ఉండదంటారు. ప్రజల భౌతికపరిస్థితులు మారితేగాని అనగా వారి ఆర్థికసంబంధాలు మారితేగాని కార్మికులకు లాభం చేకూరదని వీరి వాదన. కాని యీ వాదనద్వారా వీరు కార్మికుల దృష్టిని విప్లవోద్యమాలన్నింటినుంచి మరల్చ ప్రయత్నిస్తారు. ప్రజల భౌతిక పరిస్థితులు మారడమంటే వీరి అర్థం బూర్జువా సమాజంలోని ఉత్పత్తిసంబంధాలు నాశనంకావడం కాదు. అవి బ్రహ్మాండమైన విప్లవంద్వారా మాత్రమే నాశనమవు

తాయి. ఇక భౌతికపరిస్థితులు మారడమంటే వీరి అభిప్రాయం యిప్పుడున్న ఉత్పత్తి సంబంధాల్లోనే పరిపాలనా నిర్వహణకు సంబంధించిన కొన్ని సంస్కరణలు (Administrative reforms) తీసుకురావడం. పెట్టుబడిదార్లకూ, కార్మికులకూ మధ్యగల సంబంధాలను చెడగొట్టకుండానే యిట్టి సంస్కరణలు తీసుకురావాలంటారు వీరు. వీటివల్ల జరిగేదల్లా పెట్టుబడిదారీ ప్రభుత్వానికి కొంత ఖర్చుతగ్గడం, పరిపాలనా నిర్వహణ కొంత సులభంకావడం.

బూర్జువా సోషలిజం కేవలం ఒక శబ్దాలంకారంగా ఉన్నప్పుడే దానికి కొంతఅర్థమైనా వుంటుంది.

బూర్జువా సోషలిస్టులు చెప్పే చివరిమాటలు యివి: కార్మికుల శ్రేయస్సుకోసమే స్వేచ్ఛావ్యాపారపద్ధతిని (Free trade) అమలుజరపాలి. కార్మికుల శ్రేయస్సుకోసమే రక్షణ సుంకాలు (Protective duties) విధింపబడాలి. జైళ్ళ సంస్కరణలుకూడా కార్మికుల శ్రేయస్సుకోసమే ప్రవేశపెట్టబడాలి. వీరుచెప్పే మాటలన్నింటిలోనూ పై మాటలకే ఏ కొంచెమైనా అర్థంఉంది.

ఈ మాటలనే క్లుప్తంగా చెప్పాలంటే "బూర్జువావర్గం కార్మికుల శ్రేయస్సుకోసమే నిలిచివుంది."

3. విమర్శనాయుతమైన ఊహాజనిత సోషలిజం, కమ్యూనిజం (Critical utopian Socialism and Communism).

ఆధునిక విప్లవాలన్నిటిలోనూ శ్రామికుల కోర్కెలను బలపరచే రచనలు అనేకం బయల్దేరడం మనం చూస్తున్నాం. అట్టి రచనలుగురించి నేమిక్కడ ప్రస్తావించ దలచుకోలేదు,

ఉదాహరణకు, బెబూఫ్ (Babeuf) మొదలైనవారి రచనలు యిలాంటివే.

ఫ్యూడల్ సమాజం నాశనం చేయబడుతూన్న రోజుల్లో, సర్వత్రా ఉద్రిక్త పరిస్థితులేర్పడ్డప్పుడు, శ్రామిక వర్గం సహజంగా మొట్టమొదటిసారి తనకోర్కెలను సాధించుకోడానికి ప్రత్యక్ష ప్రయత్నాలు చేసింది. కాని అవన్నీ సహజంగా విఫలమయాయి. ఇందుకు కారణం, అప్పట్లో శ్రామిక వర్గం తగినంతగా అభివృద్ధిచెందకపోవడం, తన విముక్తికవసరమైన ఆర్థిక పరిస్థితులింకా యేర్పడకపోవడం, పెట్టుబడిదారి సమాజంలోమాత్రమే అట్టి పరిస్థితులేర్పడతాయి. ఈ ప్రాథమికదశలో బయల్దేరిన రచనలన్నీ అభివృద్ధినిరోధక రచనలే. అవి సర్వసంగపరిత్యాగాన్నీ, అతి మొరటురూపంలో సాంఘిక సమానత్వాన్నీ బోధించాయి.

శ్రామికవర్గానికీ – పెట్టుబడిదారీవర్గానికీ మధ్య ప్రాథమిక పోరాటాలు జరిగేదశలో (పెట్టుబడిదారులు-శ్రామికులు అనే శీర్షికతో వ్రాయబడిన మొదటి సెక్షన్ చూడండి), సెయింట్ సైమన్, ఫోరియర్, ఓవెన్ (Saint Simon, Fourier, Owen) మొదలైనవారు కొన్ని గ్రంథాలు వ్రాశారు. అవి సోషలిస్టు, కమ్యూనిస్టు రచనల పేర్లతో వ్యవహరింపబడేవి.

వీరు నేటి పెట్టుబడిదారీ సమాజంలోని వర్గవైషమ్యాలను స్పష్టంగానే చూచారు. ఆ సమాజాన్ని నాశనంచేసే విప్లవశక్తుల్ని కూడా గుర్తించారు. కాని, శ్రామికవర్గం ఇంకా బాల్యావస్థలో ఉండడంవల్ల అది చరిత్రలో ఎట్టి ప్రముఖపాత్ర

వహించ లేదనీ, స్వతంత్రంగా రాజకీయోద్యమాలు నడుపజాల దనీ, వారు భావించేవారు.

పరిశ్రమలెంత బాగా అభివృద్ధి చెందితే వర్గవైషమ్యా లంత తీవ్రతరమవుతాయి గనుక ఆనాడు వారి యెదుటనున్న ఆర్థికపరిస్థితులు శ్రామికుల విముక్తి కవసరమైన అనుకూల వాతావరణాన్ని యింకా సృష్టించలేదని వారి అభిప్రాయం. అట్టి వాతావరణాన్ని సృష్టించడానికి వీరొక క్రొత్త సామాజిక శాస్త్రంకోసం క్రొత్త సామాజిక సిద్ధాంతాలకొరకు వెదకడం ప్రారంభించారు.

అంటే వీరి ఊహాప్రపంచంలోని కల్పితఘటనలముందు వాస్తవికమైన చారిత్రక ఘటనలేవీ జరక్కూడదన్నమాట. శ్రామికుల విముక్తికి యే పరిస్థితులుండాలని వీరు భావిస్తారో, వాటికి చారిత్రక పరిస్థితులు లోబడాలన్నమాట. కార్మికులు క్రమంగా తమంతట తాము ఒకేవర్గంగా సంఘటితం కావడం ఒక చారిత్రక పరిణామదశ. ఈ వాస్తవాన్ని వీరు త్రోసి రాజని తాము యెట్టి సమాజం మంచిదని భావిస్తారో అలాంటి సమాజాన్ని నిర్మించాలంటారు. చరిత్రయొక్క భవిష్యత్తు అంతా వీరి ప్రణాళికలను ప్రచారము చేయడంమీద, వాటి నమలుజరపడంమీద ఆధారపడివుంటుందని వీరి అభిప్రాయం.

వీరు ప్రణాళికలను తయారుచేసే సమయంలో అందరికంటె బాధపడేవర్గం కార్మికులనీ, అందువల్ల కార్మికుల శ్రేయస్సు కోసమే తాము ప్రధానంగా పాటుపడుతున్నామని జ్ఞాపక ముంచుకుంటారు. కార్మికులు అందరికంటే బాధపడేవర్గంగా మాత్రమే వీరి దృష్టికి కనపడతారు.

వర్గపోరాటం ఆనాడు యింకా ప్రాథమికదశలో ఉండ డము వల్లనూ, వీరి చుట్టూవున్న పరిసరాల ప్రభావంవల్లనూ వర్గవైషమ్యాలకు తాము అతీతులమని వీరు భావించేవారు. మానవులందరినీ ఉన్నతస్థానాల్లో ఉండేవారిని సహా ఉద్ధరిం చాలని వీరికోరిక. అందుకనే వీరు మానవసమాజానికంతకూ విజ్ఞప్తిచేయడం పరిపాటైంది. ఆ సమాజంలో వివిధ వర్గాల మధ్య వైషమ్యాలున్నాయనే విషయం వీరి గుర్తుకురాదు. అంతేకాదు. వీరు ప్రధానముగా పాలకవర్గాలకే విజ్ఞప్తులు చేస్తారు. వీరి అభిప్రాయంప్రకారం ప్రజలు తాము వాంఛించే సామాజిక వ్యవస్థనుగురించి ఒకసారి సమగ్రంగా తెలుసుకుంటే చాలు, దాన్ని తమ ప్రణాళిక ద్వారా సాధించుకోవచ్చునని భావిస్తారు.

కనుకనే వీరు రాజకీయ కార్యకలాపాలన్నిటిని వ్యతిరే కిస్తారు. ముఖ్యంగా విప్లవ కార్యకలాపాలను తిరస్కరిస్తారు. శాంతియుతంగానే తమ ఆశయాలను సాధించుకోగలమని వీరి నమ్మకం. నూతన సమాజాన్ని గురించి తాము చెప్పే ఉప దేశాలను చిన్నయెత్తున ఆచరణలో పెట్టడంద్వారాను (ఇట్టి ప్రయత్నాలు తప్పనిసరిగా విఫల మవుతాయి), తాము స్వయంగా మార్గదర్శకులు కావడంద్వారాను, తమ ఆశ యాలు సిద్ధిస్తాయని వీరి విశ్వాసం.

కార్మికవర్గం చాలా వెనుకబడియున్న దశలో అది తన చారిత్రకపాత్రను గుర్తించడం అసంభవం. సమాజంలో తనకుగల స్థానాన్ని గురించి అది కొన్ని ఊహాకల్పిత భావా లను కలిగియుంటుంది. అందుచేతనే నూతన సమాజాన్ని

గురించికూడా పై విధమైన ఊహాకల్పితభావాలు చిత్రింప బడ్డాయి. మొత్తం సమాజమంతా సంస్కరింపబడాలనే కార్మికులవాంఛకు అనుగుణ్యమైన విధంగానే పై భావాలు ప్రచారంలోకి వచ్చాయి.

ఈవిధమైన సోషలిస్టు రచనల్లోను, కమ్యూనిస్టు రచనల్లోను పెట్టుబడిదారీ విధానంపై తీవ్రవిమర్శనలుంటాయి. నేటి సమాజం యే మూలసూత్రాలపై ఆధారపడివుందో, వాటన్నిటినీ యీ రచనలు ఖండిస్తాయి. అందువల్ల కార్మికులు విజ్ఞానవంతులు కావడాని కవసరమైన విషయాలెన్నో వాటిలో ఉంటాయి. పల్లెలకూ – పట్టణాలకూ మధ్యగల కృత్రిమ వ్యత్యాసాన్ని నిర్మూలించాలనీ; ఆధునిక కుటుంబ సంబంధాలను నాశనంచేయాలనీ; పరిశ్రమలు వ్యక్తుల లాభాల కోసం నడుపబడరాదనీ; యజమానులు కార్మికులకు జీతాలిచ్చి పనిచేయించుకొనే పద్ధతి పోవాలనీ; సమాజంలోని వ్యక్తులందరూ సామరస్యంతో జీవించే పద్ధతి ఉండాలనీ; రాజ్యాంగయంత్రం కేవలం వస్తూత్పత్తి నిర్వహణకు సాధనంగా మాత్రమే ఉండాలనీ – యీ రచనలు బోధిస్తాయి. ఇవన్నీ వర్గ వైషమ్యాల నిర్మూలనకు సంబంధించిన సూచనలే. ఆ రోజుల్లో వర్గ వైషమ్యాలు అప్పుడే తలయెత్తుతూండడంవల్ల, అవి యీ రచనల్లో అతిప్రాథమికమైన, అస్పష్టమైన రూపాల్లో వివరింపబడ్డాయి. అందుచేత, పైవన్నీ కేవలం ఊహాజనితమైన సూచనలే.

ఈ ఊహాజనిత సోషలిజం, కమ్యూనిజం చారిత్రక గమనానికి ప్రత్యక్షవిరుద్ధమైన సిద్ధాంతాలు. ఆధునిక వర్గ

పోరాటం నానాటికి తీవ్రతరమై, స్పష్టంగా రూపొందేకొద్దీ దానికి దూరంగా ఉండడం యెవరితరమూకాదు. కాని, ఊహాజనిత సోషలిజం వర్గపోరాటాని కతీతమైన సిద్ధాంతంగా కనబడుతూ, వాస్తవ పరిస్థితుల్ని కప్పిపెట్టడం జరుగుతోంది. ఇట్టి సోషలిస్టులు పెట్టుబడిదారీవిధానాన్ని ఖండిస్తూ పైకెంత తీవ్రవిమర్శనలు చేసినా, ఆచరణలో వాటికేమీ విలువ లేదు. సిద్ధాంతరీత్యాకూడ అవి సమర్థించ వీలుకానివి. అందుచేత, యీ నూతన సమాజ సంస్థాపకులు చాల విషయాల్లో విప్లవకారులే అయినప్పటికీ, వారిశిష్యులు ప్రతిసందర్భంలోనూ అభివృద్ధినిరోధక ముఠాలుగా తయారయారు. చారిత్రక గమనంలో కార్మికవర్గం అంతకంతకు అభివృద్ధి చెందుతూ పురోగమిస్తూంటే, యీ శిష్యబృందం కార్మికోద్యమానికి వ్యతిరేకంగా తమ గురువుల ఉపదేశాలను గుడ్డిగా అనుసరించడం జరిగింది. ఈ విధంగా వారు వర్గపోరాటాన్ని నిర్వీర్యంచేయడానికి ప్రయత్నించారు. వర్గాలమధ్య సామరస్యం కుదర్చడం కోసం వారు కృషిచేశారు. ఇప్పటికీ వీరు తమ ఊహాకల్పిత జగత్తును నిర్మించడంకోసం చిన్నచిన్న ఎక్స్పెరిమెంట్లు చేయాలంటారు. కొన్ని కొన్నిచోట్ల ఫెలాన్స్టర్లను (Phalanstres), సమిష్టి నివాస క్షేత్రాలనూ (Home colonies) చిన్న ఐకేరియాలను (little Icarias) ♦ స్థాపించాలంటారు.

---

♦ ఫెలాన్స్టర్లంటే, ఫోరియర్ తయారుచేసిన ఒక ప్లానును బట్టి నిర్మింపబడ్డ సోషలిస్టు క్షేత్రాలు. ఐకేరియా అంటే, క్యాబెట్ తన ఊహా ప్రపంచానికి పెట్టుకున్న పేరు. తర్వాత అతడు అమెరికాలో స్థాపించిన కమ్యూనిస్టు కాలనీకికూడా యీ పేరు పెట్టాడు. —ఎంగెల్సు.

ఇవి వీరి దృష్టిలో ఆదర్శవంతమైన స్వర్గరాజ్యాలు. వీటిని నిర్మించడానికి పెట్టుబడిదార్ల దయాదాక్షిణ్యాలమీద, వారి ధనసహాయంమీద ఆధారపడతారు. ఇట్టివారు క్రమక్రమంగా పై నుదహరింపబడిన అభివృద్ధినిరోధక సోషలిస్టులుగా దిగజారుతారు. వారికీ, వీరికీ భేద మేమంటే వారికంటె వీరెక్కువ క్రమబద్ధంగా దంబాలు పలుకుతారు. వారికంటె వీరెక్కువ మొండిగా మూఢత్వంతో తమ సిద్ధాంతాలన్నీ మంత్రాలవలె ఫలిస్తాయని నమ్ముతారు.

కనుకనే వీరు కార్మికుల్ని రాజకీయ కార్యకలాపాల్లో పాల్గొననీయకుండా చేస్తారు. వీరి అభిప్రాయం ప్రకారం అలా పాల్గొనడమంటే అర్థం తమ ఉపదేశాల్లో నమ్మకం లేకపోవడమన్న మాట.

ఇంగ్లండులో ఓవెన్ అనుచరులు ఛార్టిస్టుల్నీ, ఫ్రాన్సులో ఫోరియర్ అనుచరులు రిఫార్మిస్టుల్నీ వ్యతిరేకించారు.

---

# IV
# కమ్యూనిస్టులకూ యితర ప్రతికూల పక్షాలకూగల సంబంధం

కమ్యూనిస్టులకూ, ప్రస్తుతమున్న కార్మికవర్గ పార్టీలకూ మధ్యగల సంబంధం రెండవ సెక్షన్‌లో స్పష్టంచేయబడింది. ఉదాహరణకు ఇంగ్లండ్‌లో ఛార్టిస్టులూ, అమెరికాలో ఎగ్రేరి

యన్ రిఫార్మర్లూ (వ్యవసాయ సంస్కరణవాదులు) కార్మిక వర్గ పార్టీలక్రిందికే వస్తారు.

కమ్యూనిస్టులు కార్మికుల తక్షణ కోర్కెలకై వారి తాత్కాలిక ప్రయోజనాలకై పోరాడేమాట నిజమే. కాని అందులోనే వారు మునిగిపోకుండా ఉద్యమమంతటి భవిష్యత్తును కాపాడ పూనుకుంటారు. దానికి వారు ప్రతినిధులుగా పనిచేస్తారు. ఫ్రాన్సులో కమ్యూనిస్టులు కన్సర్వేటివ్ పెట్టుబడిదార్లకూ, రాడికల్ పెట్టుబడిదార్లకూ వ్యతిరేకంగా సోషల్ డెమాక్రేట్లతో కలిసిపోరాడుతారు. ♦ అయితే, ఫ్రెంచి విప్లవంయొక్క సాంప్రదాయాల ఫలితంగా ప్రచారంలోకి వచ్చిన కొన్నిమాటలనూ, కొన్నిభ్రమలనూ విమర్శించే హక్కును మాత్రం వారు వదలుకోరు.

స్విడ్జర్లండ్ లో కమ్యూనిస్టులు రాడికల్స్ను బలపరుస్తారు. అయితే పరస్పర వ్యతిరేకదృక్పథాలకు చెందినవారు ఆపార్టీలో సభ్యులుగా వున్నారనే విషయాన్ని మరువరు. ఉదాహరణకు ఫ్రెంచి డెమాక్రటిక్ సోషలిస్టుల్ని పోలినవారూ, రాడికల్ బూర్జువావర్గంకూడా అందులో సభ్యులే.

---

♦ ఆ రోజుల్లో లెద్రూరోలిన్ (Ledru Rollin) అను నతడు ఫ్రెంచి పార్లమెంటులో సోషల్ డెమాక్రటిక్ పార్టీకి ప్రతినిధిగా ఉండే వాడు. లూయీబ్లాంక్ (1811-1882) సాహిత్యరంగంలో పనిచేసేవాడు. "రిఫార్మ్" అను పత్రిక సోషల్ డెమాక్రటిక్ దినపత్రికగా పరిగణింప బడేది. "సోషల్ డెమాక్రసీ" అను శబ్దాన్ని సృష్టించినది వీరే. డెమాక్రటిక్ పార్టీలోగాని, రిపబ్లికన్ పార్టీలోగాని ఒక గ్రూపుగా వుంటూ కొద్దో గొప్పో సోషలిస్టుభావాలు గలిగినవారంతా ఆ రోజుల్లో సోషల్ డెమాక్రాట్లని పిలువబడేవారు. — ఎంగెల్స్.

పోలెండ్‌లో కమ్యూనిస్టులు వ్యవసాయవిప్లవం రావాలనే పార్టీకో సహకరిస్తారు. జాతీయ స్వాతంత్ర్యసిద్ధికి వ్యవసాయ విప్లవం అవసరమని యీపార్టీ నమ్ముతుంది. 1846లో క్రాకో తిరుగుబాటుకు ప్రోత్సాహమిచ్చిన పార్టీ యిదే.

జర్మనీలో పెట్టుబడిదారీవర్గం నిరంకుశ రాచరికానికీ, ఫ్యూడల్ భూస్వామ్యవర్గానికీ, పెటీబూర్జ్వావర్గానికీ వ్యతిరేకంగా విప్లవమార్గంలో పోరాడేపక్షంలో కమ్యూనిస్టులు పెట్టుబడిదారీవర్గంతో కలిసి పనిచేస్తారు.

అయితే, పెట్టుబడిదారులూ – శ్రామికులూ శత్రువర్గాలనే విషయాన్ని కమ్యూనిస్టులు నిరంతరం, ఎడతెగకుండా శ్రామికులకు చెబుతారు. తద్వారా, పెట్టుబడిదారులు సృష్టించిన నూతన సాంఘిక రాజకీయ పరిస్థితులను కార్మికులు తమ పోరాట సాధనాలుగా ఉపయోగించుకొంటారు. ఆ సాధనాలతో జర్మన్ కార్మికులు పెట్టుబడిదారీవర్గంమీద పోరాటం జరపడానికవకాశ మేర్పడుతుంది. జర్మనీలో అభివృద్ధి నిరోధకులు పతనమైన వెంటనే, పెట్టుబడిదారీవర్గంమీద పోరాటం సాగించడానికి అనుకూల పరిస్థితు లేర్పడుతాయి.

కమ్యూనిస్టులు తమ దృష్టిని ప్రధానంగా జర్మనీమీద కేంద్రీకరించడానికి ఒక కారణం ఉంది. ఆ దేశంలో బూర్జువావిప్లవం ప్రారంభంకాబోయే పరిస్థితు లీరోజున ఉన్నాయి. ఇతర దేశాల్లోకంటే జర్మనీలోనే యూరపియన్ నాగరికత ఎక్కువ ఉచ్ఛస్థితిలో ఉంది. శ్రామికవర్గంకూడా ఎంతో అభివృద్ధి చెందింది. 17వ శతాబ్దపు ఇంగ్లండ్‌లోగాని, 18 వ శతాబ్దపు ఫ్రాన్సులోగాని శ్రామికులు యింతగా అభివృద్ధిచెందలేదు.

రెండవకారణం, జర్మనీలో బూర్జువా విప్లవం వస్తే అది అక్కడితో ఆగిపోక, వెంటనే శ్రామిక విప్లవానికి దారి తీస్తుంది.

క్లుప్తంగా చెప్పాలంటే, నేటి సాంఘిక రాజకీయ వ్యవస్థకు వ్యతిరేకంగా ఏ దేశంలో విప్లవోద్యమం కొనసాగినా, దాన్ని కమ్యూనిస్టులు బలపరచితీరుతారు.

అట్టి ప్రతి ఉద్యమంలోనువారు ఆస్తిసమస్యను ప్రధాన సమస్యగా ప్రజలముందు పెడతారు. ఆస్తి వివిధ దేశాల్లో వివిధస్థాయిల ప్రకారం అభివృద్ధిచెందుతుందనే విషయం నిజమే. అయినా, ప్రధాన సమస్యమాత్రం అదేనని వారు నమ్ముతారు.

ఆఖరి విషయ మేమంటే, అన్ని దేశాల్లోనూ కమ్యూనిస్టులు ప్రజాతంత్ర పార్టీలతోకలిసి పనిచేస్తారు; వాటితో ఒడంబడికలు చేసుకుంటారు.

కమ్యూనిస్టులు తమ అభిప్రాయాలనూ, తమ ఆశయాలనూ, కప్పిపుచ్చుకోవడమంటే ఏవగించుకొంటారు. ప్రస్తుత సామాజిక వ్యవస్థను బలప్రయోగంద్వారా నాశనం చేస్తే గాని తమ ఆశయాలు సిద్ధించవని వారు బహిరంగంగా ప్రకటిస్తారు. కమ్యూనిస్టు విప్లవమంటే పాలకవర్గాలు గజగజ వణక్కుతాయి. శ్రామికులకు మాత్రం బానిసశృంఖలాలు తప్ప పోయేదేమీ లేదు.

ప్రపంచ కార్మికులారా, ఏకముకండి !